



# JWALA






.....AN INDEPENDENT TELUGU WEEKLY.....

పి. వి. జి. రాజుగారి 39 వ జన్మదిన ప్రత్యేక సంచిక.

# * శుభాకాంక్షలు *



మే 1 నుండి కాంగ్రెస్ భావాలను, కార్యక్రమములను ప్రచారము చేయుటకు 'జ్వాల'ను నడపుటకు మీరు నిర్ణయించుకున్నట్లు తెలుసుకొనుటకు నేను చాల సంతసించుచున్నాను. మీ 'జ్వాల' తప్పకుండ కాంగ్రెసు భావములను, కార్యక్రమములను తన పాఠకులకు అందించగలదని నేను ఆశించుచున్నాను. మీ 'జ్వాల' సంపూర్ణ విజయాన్ని నేను కోరుచున్నాను.

హైదరాబాదు.
14-4-62.

మీ ఆప్తుడు.
ఆలపాటి వెంకటరామయ్య.
మున్సిపల్ పరిపాలన మంత్రి.



మీరు 'జ్వాల'ను నడుపుచున్నందుకు సంతోషించుచున్నాను, మీరు కోరినట్లు మా పత్రికనుండి అనువదించుకొనుటకు మేము అంగీకరించుచున్నాము.

మీకు మా సహకారమునకు హామీ యిచ్చుచూ, మా శ్రేయో కాంక్షను తెలియజేయుచున్నాము.

కొత్తఢిల్లీ,
9—4—62.

H. D. మాళవ్య,
'సోషలిస్టు కాంగ్రెస్ మన్' సంపాదకులు.

ఆర్యా!

మీరు వ్రాసిన జాబు చేరినది, సంతోషం, 'జ్వాల' నిర్వహణ కొనసాగించవలయునని నిర్ణయించుట ముదావహము, నిత్య నూతనశోభతో అలరారు గాత.

సెలవు.

రాధాకృష్ణ.
ఆంధ్ర ప్రదేశ్ యువజన,
కాంగ్రెసు ప్రధానకార్యదర్శి.

హైద్రాబాదు,
10—4—62.



శ్రీ పి. వి. జి. రాజు జన్మదిన ప్రత్యేక సంచిక మీ పత్రిక 'జ్వాల' ను ప్రచురించుచున్నట్లు తెలుసుకొని నేను సంతోషించు చున్నాను. పత్రికకు నా శ్రేయో కాంక్షను అందించు చున్నాను.



విజయవాడ
15-4-62

మీ శ్రేయోభిలాషి
యం. ఆర్. అప్పారావు,
ఎక్సయిజ్ అండ్ మద్యనిషేధమంత్రి

—: సంపాదక వర్గం:—

గుంటుపల్లి వెంకటేశ్వరరావు

వడ్డెంపూడి హనుమంతరావు

సానికొమ్ము కృష్ణారెడ్డి

*

——ఈ సంచికలో——

—:O:—



*

ప్రచురణ :-

అరండల్ పేట

గుంటూరు—2,

విడిపత్రిక 16 న. పై.

సంవత్సరచందా 8—75 న. పై.



సంపుటి 1 | 30—4—62 | సోమవారము | సంచిక 40

# మే 1

ప్రపంచ పీడిత ప్రజలకు ఐక్యతా సందేశాన్ని అందజేసిన శుభదినం. యూరపు ఖండపు కార్మికలోకం మేల్కొంచుటకు యీ దినపు శంఖారావమేనాంది, రెక్కలు విరచి రక్తాన్ని స్రవింపజేసి సృష్టించిన భాగ్యాన్ని, కొద్దిమంది కోటీశ్వరులు కులాసాలకు దర్జాలకు ధారపోయకుండ ఆనకట్ట వేసిన ఆరంభ దినం. ఆనాడు ప్రపంచంలోని ఏ ఒక్క మూలనో ఎలుగెత్తి చాటబడ్డ నాందీ గీతం, దిశలెల్ల మారు మ్రోగి ప్రపంచమంతటిలోని శ్రామిక జనం మేల్కొని దోపిడి నరికట్టుటకుసడుంకట్టేలా చేసిందాదినమే.

ఆలాగే మే, ఒకటవ తేదీన సోషలిస్టు సమాజ నిర్మాణానికి జీవితాన్ని ధారవోసిన శ్రీ పి. వి. జి. రాజు గూడ జనన మందారు.

ఆంధ్ర ప్రదేశ్ విద్యాశాఖామాత్యులు శ్రీపి.వి.జి.రాజుగారి జన్మదిన ప్రత్యేక సంచికగా జ్వాలను మీ కందిస్తున్నాము. "పిల్లి సముత్తరకుబొమ్మల పెండ్లిండ్లకు కవిత్వ మల్లుట నా కలవడ దయ్యెన్" అని వెనుకటికోమారు సాహిత్య విశారద శ్రీతాపీ ధర్మారావుగా రన్నారు. రచయిత ఏ దేని వ్రాయాలను కొన్నప్పుడు అందుకు బలమైన విషయ ప్రేరేపణ తగు కారణం ఉండక తప్పదు,

శ్రీ రాజుగారు పుట్టినది మే 1వ తేది, యీ తేదీ ప్రపంచ శ్రామిక జనావళికి పర్వదినం. యీ తేదీన జన్మించిన శ్రీ రాజుగారు సోషలిస్టు భావాలకు, సమ సమాజనిర్మాణాన్ని శాంతియుత పద్ధతుల్లో సాధించ గోరే యువతరానికి ముఖ్య ప్రతినిధి.

పెట్టుబడి దారీ సమాజానికి స్థానమైన జమీందారుల కుటుంబములో జన్మించారు. శ్రీ రాజుగారు వంశపారం పర్యంగా వస్తున్నరాజకుటుంబ వ్యవహారములు, హుందాతనం, వారికి చిన్న తనంనుండే ఏర్పరచటం జరిగింది. పాశ్చాత్య దేశాలలో విద్యాభ్యాసం వలన విదేశీ నాగరికత, ఆంగ్ల భాషలో పాండిత్యం చిన్నతనంలోనే అలవడింది. కాని పిన్న వయస్సులోనే రాజుగారు సోషలిస్టు భావప్రభావానికి లోనై ఆంధ్ర దేశంలో సోషలిస్టు ఉద్యమాన్ని పటిష్టంగా నిర్మించి అనేకమంది యువకులను ఆ రంగంలోకి ఆకర్షించినాడు. కాంగ్రెసు సోషలిజాన్ని అంగీకరించిన తరువాత దేశ రాజకీయ పరిస్థితులలో వచ్చిన మార్పులతో పెట్టుబడి దారీ వర్గాలు సోషలిస్టు సమాజ నిర్మాణం జరుగకుండా ఉండేందుకు గట్టిగా సమీకృత మవుతున్నందున, ఒకే లక్ష్యానికి పాటుపడే వ్యక్తులు, సంస్థలు భిన్నభిన్నంగా ఉండటం మంచిది కాదనే దృష్టితో శ్రీ రాజుగారే కాంగ్రెసులో చేరి కాంగ్రెసులోని సోషలిస్టు క్యాంప్‌ను బలపరచి తద్వారా

# మన పి.వి.జి.రాజు

1924 మే, 1 వ తేదీ ఆంధ్ర ప్రదేశానికి శుభదినం. పీడిత ప్రజలకు సేవ చేయాలనే త్యాగశీలుని, నిరాడంబరుని. అచంచల దీక్షాపరుని ఆంధ్రమాతపుత్రుని గా శ్రీ పి.వి జి రాజు జన్మించిన దినాడే. జన్మతః మహారాజుగా పుట్టి బాల్యమునుండి ఆంధ్ర దేశానికి దూరంగా పెరిగి, పాశ్చాత్య దేశాలలో విద్యాభ్యాసము గావించి, అందలాలపై ఆపలాడే శ్రీ పి వి.జి. రాజు ఆంధ్ర దేశానికి సేవ చేయ బూనుతాడని 1952 వరకు ఎవ్వరూ ఊహించి యుండలేరు. ఆ భాగ్యాన్ని ఆంధ్ర దేశాని కందజేసిన ఘనత శ్రీ జయప్రకాష్ నారాయణదని చెప్ప బూనడం సాహసం గాబోదు.

తొలిసారిగా 1952 జనరల్ ఎన్నికలలో శ్రీ పి, వి జి. రా జు ను ఆంధ్ర దేశమునుండి మద్రాసు రాష్ట్ర శాసన సభకు అభ్యర్థిగా సోషలిష్టు పార్టీ తరఫున అనాటి రాష్ట్ర పార్టీ అభిమతానికి భిన్నంగా, నిలబెట్టి, వారి సేవలను అందింపజేసే అవకాశాన్ని కలుగజేసిన శ్రీ జయప్రకాష్‌కు ఆంధ్ర దేశం కృతజ్ఞత తెల్పవలసి యుంది. ఆనాటినుండి నేటివరకు త్యాగశీలతతో, రాజకీయ రంగంలో అహోరాత్రాలు కృషి చేస్తూ సో ష లి జ పు గమ్యాన్ని మరువకుండ పీడితప్రజల ఆశాజ్యోతిగా ఆంధ్ర దేశీయమంత్రి మండలిలో సభ్యుడుగా కృషిచేయుచున్నారు.



భారత సాంప్రదాయలకు సోషలిజానికి వైరుధ్యం లేదనేందుకు నిదర్శనగా వీరిలో, ఆధ్యాత్మిక చింతన మూర్తీభవించింది. మానవ సేవే మాధవ సేవ, అను సూక్తికి జీవితాన్ని అంకితం జేశారు. సోషలిష్టు సమాజ నిర్మాణంలో మానవ సేవ మిళితమై తద్వారా ఆధ్యాత్మిక సంతృప్తి సాధించవచ్చునని వీరి భావన.

శ్రీ పూసపాటి విజయరామ గజపతిరాజు బెంగుళూరులో ఇంటర్ మీడియట్ కాలేజీలోను, మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలోను విద్యాభ్యాసం గావించి, అమెరికా కొలంబియా యూనివర్సిటీలో ఉన్నత విద్య నభ్యసించారు. క్రీడారంగంలో అత్యంత అభిమానుడు. ఈత గుర్రపు పందెములు తదితర బాహ్య క్రీడలయందు అభిరుచి గల్గియున్నాడు. విల్లింగ్‌టన్‌స్పోర్ట్సుక్లబ్, బొంబాయి, క్రికెట్ క్లబ్ అఫ్ ఇండియా, బొంబాయి, మద్రాసు రేస్‌క్లబ్, కాస్మా పాలిటన్ క్లబ్ మద్రాసు. మద్రాసు జింఖానాక్లబ్, ఢిల్లీ జింఖానా క్లబ్, ఢిల్లీ గోల్ఫ్‌క్లబ్, సికింద్రాబాద్ క్లబ్, తదితర ప్రముఖ క్లబ్‌లయందు సభ్యత్వము గల్గి క్రీడారంగమునకు సహకారాన్ని ఇవ్వడం వారి ప్రత్యేకత,

1947లో కాంగ్రెసులో చేరి తిరిగి 1948 లో అఖిల భారత కాంగ్రెసు సోషలిష్టు పార్టీ నిర్ణయానుసారం కాంగ్రెసును వదలి సోషలిష్టు పార్టీలో పనిచేయ నారంభించారు. ఆయన తమిళనాడు సోషలిష్టు పార్టీలో సభ్య–

---

త్వరితగతిని సర్వమానవ సౌభాగ్యాన్ని చేకూర్చే సోషలిష్టు స మా జా న్ని నిర్మించ నడుం కట్టారు.

అందుచే యీనాడు ప్రపంచ శ్రామిక దినం అయిన మేడే సమ సమాజ నిర్మాణానికై అహరహం కృషి చేస్తున్న శ్రీ రాజు గారి జన్మ దినం కూడా యీ నాడే అయినందున యీ ప్రత్యేక సంచికను వెలువరించుటకు తద్వారా వారి జన్మదిన సందర్భములో మరొక్క మారు వారి సేవలు కృషి స్మరించుకొనేందుకు మరీ అవకాశం కలిగింది. ఉన్నత గుణ సంపన్నుడు, అభ్యుదయ భావవాది అయిన శ్రీ పి.వి.జి. రాజుగారికి వారిముప్పది తొమ్మిదవ జన్మదిన సందర్భములో 'జ్వాల' తమ ప్రత్యేక సంచికను కానుకగా సమర్పించు కొంటున్నది.

డుగా కృషి చేస్తూయున్న రోజులలో శ్రీ జయ ప్రకాశ్ నారాయణ తమిళ నాడు పర్యటనకువచ్చినప్పుడు శ్రీజయ ప్రకాశ్ తోకలసి తమిళనాడంతా పర్యటించాడు. తరువాత జయప్రకాష్ ఆంధ్ర దేశానికి పర్యటనకు వచ్చినపుడు విజయనగరము ఆహ్వానించిరు 10,000 బహూకరించారు, అప్పటి నుండి ఆంధ్ర సోషలిస్టు ఉద్యమానికి చేయూతగా యుంటూ 1952 మొదటి జనరల్ ఎన్నికలలో సోషలిస్టు పార్టీ అభ్యర్థిగా పోటీ జేసి విజయాన్ని సాధించారు, ఇంకా కొంతమంది సోషలిస్టు అభ్యర్థుల విజయానికితోడ్పడ్డారు. తరవాత ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం కోసం శాసన సభ సభ్యత్వమునకు రాజీనామాయెచ్చి, తిరిగి ఎన్నికలలో పోటీ చేసి విజయాన్ని సాధించారు. స్వర్గీయ శ్రీ ప్రకాశంపంతులు గారిని శృంగవరపు కోట నియోజకవర్గంలో నిలబెట్టి వారికి శాసనసభలో స్థానాన్ని లభింపజేశారు, ఆంధ్ర దేశానికి తాత్కాలిక రాజధానిగా కర్నూలు పట్టణాన్ని నిర్ణయించిన తరువాత ఆంధ్ర హైకోర్టును గుంటూరులో ఏర్పరచాలనే నిర్ణయం జరుగుటకు ఎంతో కృషిచేసి సాధించారు. ఆ నాటి వరకు ప్రజా సోషలిస్టు పార్టీలో సభ్యులుగా యుంటూ, పార్టీ నిర్ణయానికి వ్యతిరేకంగా కాంగ్రెసుతో చేతులు కలిపి మంత్రి మండలిలో ప్రవేశించిన కీ॥ శే॥ ప్రకాశం పంతులు శ్రీతెన్నేటి విశ్వనాథంగార్లతో అభిప్రాయ భేదం వచ్చిన కారణాన ఆంధ్ర దేశమంతా పర్యటించి ప్రజా సోషలిస్టు పార్టీనాయకత్వాన్ని చేపట్టారు. అఖిల భారత స్థాయిలో సోషలిస్టు నాయకుడుగా సేవ చేస్తూ ఆంధ్ర దేశములోని ప్రత్యేక పరిస్థితులలో కాంగ్రెసు, కమ్యూనిస్టు పార్టీలకు దూరంగా బలీయమైన మూడవ కూటాన్ని ఏర్పరచాలనే సంకల్పంతో సోషలిస్టు డెమోక్రటిక్ పార్టీని స్థాపించాడు. కాని కొలది కాలంలోనే డెమాక్రటిక్ పార్టీవారు స్వతంత్ర పార్టీలో చేరిపోవాలనే నిర్ణయం తీసుకొనుటతో ఆ పార్టీ విచ్ఛిన్నమై పోవడం జరిగింది.

అనేక ప్రజా ఉద్యమాలలో జైళ్ళకు పోవడం తటస్థించింది. కర్నూలు జిల్లా కరివెన ఈనాం రెతు సత్యాగ్రహంలోను, గుంటూరు జిల్లా మాచర్లనద్ద నాగార్జున సాగర్‌ప్రాంత రైతు యాత్ర సందర్భంలోను జైళ్ళకువెళ్ళారు. ఉత్తర ప్రదేశ్, బీహార్ రాష్ట్రాలలో సత్యాగ్రహాలకు నాయకత్వం వహించి గూడ జైలుశిక్ష ననుభవించారు.

1952, 1955, 1962 సాధారణ ఎన్నికలలోను, 1960 బై ఎలక్షనులోను శాసన సభ్యుడుగాను, 1957లో పార్లమెంటు సభ్యుడుగాను ఎన్నికౌతూ వచ్చారు, 1955ఎన్నికలలో శ్రీతెన్నేటి విశ్వనాథంగారి ఓటమికి, 1957 ఎన్నికలలో శ్రీ వి. వి. గిరిగారి ఓటమికి శ్రీ పి. వి. జి. రాజుగారు బాధ్యులని చెప్పవచ్చు.

ఒక వైపు మితవాద నిరోధక వర్గాలు స్వతంత్ర పార్టీగాను మరొక వైపు జాతీయ వ్యతిరేక కమ్యూనిస్టు పార్టీ యున్నూ కాంగ్రెసును బలహీనపరచి అధికారాన్ని హస్తగతం చేసుకోవాలని తాపత్రయ పడుచున్నందున. దేశంలోని జాతీయ సోషలిస్టు భావాలకు పరీక్ష సమయంగా పరిగణించి, కాంగ్రెసులోకి అభ్యుదయ కాముకులు, సోషలిస్టు సమాజ నిర్మాణంపై కుతూహలమున్న వారితో కలసి కృషి చేయవలసిన అవసరమున్నదని గ్రహించి 1959 లో కాంగ్రెసులో ప్రవేశించారు. తరువాత శ్రీ నీలం సంజీవరెడ్డి అఖిల భారత కాంగ్రెసు అధ్యక్ష స్థానాన్ని అలంకరించడంతో శ్రీ దామోదరం సంజీవయ్య ముఖ్య మంత్రిత్వాన ఏర్పడ్డ మంత్రి మండలిలో ఆరోగ్య మంత్రిగా కృషిచేసి ఆరోగ్య శాఖకు గుర్తింపు, రాణింపు కలుగ జేశారని చెప్పవచ్చు. ఆరోగ్య శాఖ అభివృద్ధికి పునాదులువేశారంటె అతిశయోక్తిలేదు, దక్షిణ రాష్ట్ర ఆరోగ్య శాఖామాత్యుల సమావేశాన్ని తొలిసారిగా తిరుపతిలో ఏర్పరచి దక్షిణ రాష్ట్రాల సంయుక్త కృషికి నాందీగీతం పాడారు. ఆరోగ్య శాఖలో నూతన ప్రణాళికలను తయారు చేయించి వాటి, అమలుకు కృషి సల్పారు. పరిపాలనలో లంచగొండి తనం. అవినీతి, బంధు పక్షపాతం లేకుండేందుకు ప్రయత్నించారు.

శ్రీ పి. వి. జి విద్యా సంస్థలకు చేసిన దానం అద్వితీయం, కొన్ని లక్షల రూపాయలు విలువ జేసే ఆస్థులను విజయ నగరంలోని వివిధ కాలేజీలకుదానంచేశారు. తనకున్న ఆస్తిలో అధిక భాగాన్ని 'మాన్సాస్' ట్రస్టుగా ఏర్పరచి విద్యాభివృద్ధికి దానంచేశారు, ఆంధ్ర దేశంలో తొలి సైనిక పాఠశాలకు విశాఖ జిల్లా కోరుకొండలో తన రాజ ప్రాసాదాన్ని శ్రీ పి. వి జి. దానముచేసి సైనిక పాఠశాల నిర్మాణ ప్రతిష్ట గూడ సంపాదించుకున్నారు.

(తరువాయి 19వ పేజీ)

# సహగమనం



—శ్రీ వేగుంట మోహనప్రసాద్

నశ్వరమైన వస్తువును బుద్బుదప్రాయమంటారు. జీవితం బుద్బుద మాత్రమని, నీటిమూటని, గాలిమాటని, సొల్లు కబురని, నమ్మదగ్గది కాదని, ఒక అబద్ధమైన సంగతని, మిధ్య అని, అద్దంలోని బింబానికి ప్రతిబింబమని లీలగ కన్పించే పొగమంచుఅని, భ్రాంతిఅని, ఇంకా మైకపు స్థితి అని, సమాధి, మూర్ఛన, లయవిభాతి అని, ఒక కల్లబొల్లి ఏడ్పు అని, స్త్రీల నెరజాణతన మని, చీకటిరాత్రి అని, నీళ్ళులేని బావిఅని, ఒక ఎందుకూ పనికిరాని అవాంఛనీయమైన వస్తువనీ, కలలో పీడకల అని, తెర అని, తెరవెనుక ఒక దరిద్రపు గొట్టు సన్నివేశమని అశేషమైన సున్నఅని—ఇంకా ఎన్నైనా అనుకోవచ్చు. అసంతా మన పదజాలాన్నిబట్టి నోరు నెప్పెట్టటాన్నిబట్టి ఉంటుంది. ఇన్నన్నా జీవితానికి కోపంరాదు. వచ్చినా నోట్లో నాలుక లేనిది కనుక ఏమీ అనదు. మహాఅయితే మూగగొంతుతో ఏడుస్తుంది. అంతకంటే ఏమీ చేత కాదు.

నిద్రవేళ మించిపోతే, జీవికి తపనగావుంటే, ఆర్ద్రమైన హృదయ పర్యంకం దుఃఖంతో పశ్చాత్తాపంతో ఊగిపోతూంటే, మనసులో వ్యధల వడగాలికి ఉక్కపోస్తుంటే, హృదయంలో కప్పల అరపులో కరంటు ధ్వని విన్పిస్తూంటే చెప్పలేని, చెప్పినా అర్థం చేసికొనలేని బాధతో కాళ్ళూ చేతులు కొట్టుకొని పోతూంటే, హృదయం టిక్కుటిక్కుమంటూంటే. కాలం హరించుకుపోతూన్నప్పుడు నిద్రవేళ మించిపోయిన రాత్రి ఆవలించి, ఉండుండి నిద్రపట్టక, దుఃఖంతో కుతకుతలాడిపోయి, వెక్కివెక్కి ఏడ్చి నిద్రపోదాం అనుకొని గిలగిల తన్నుకుంటున్నప్పుడు—జీవితమనే రాత్రికి తెలియకుండ ఒక్కసారే ధన్మన తెల్లవారుతుంది. ప్రవాహం మునకలెత్తుతుంది, కృపాజలధిపై క్షమాసుమాలు కొట్టుకొనిపోతాయి, విడవడుతున్న జడలో పూలు వాడిపోతాయి, ధ్వని లీనమైపోతుంది.

తలుపు తట్టిన చప్పుడుకు ఉలిక్కిపడి నిద్ర లేచాను. అసలు నాకు నిద్ర ఎప్పుడు పట్టిందికనుక! ఈ కథ ఒకరాత్రివేళ జరిగింది. అర్ధరాత్రి మొదలయి వేకువలో అంత మవుతుంది. తెల్లవారితే అంతా మామూలే. అసలేం జరగనట్లుగానే ఉంటుంది.

"ఇంతవేళప్పుడు వచ్చావేంటి?"

"ఆ! ఆ! ఊర్కేనే వచ్చాను."

"అయితే డబ్బులికి రావా?"

"పుచ్చుకుంటావా"

"ఆ! ఆ! ఎందుకు పుచ్చుకోరు?"

"వేశ్యలు ఇట్లాగే మాట్లాడుతారు"

"విటులూ ఇట్లాగే మాట్లాడుతారు"

"అదంతా నీకే తెలుస్తుంది బాగా"

"ఎవరికి తెలీదు? ఈ విషయం అందరికీ తెలుస్తుంది"

"అందరికీ తెలుస్తుందని మాత్రమే నాకు తెలుసు"

ఇట్లా పోట్లాడుకొన్నాం. మనిషి వచ్చీరావటం తోనే ఇట్లా మాట్లాడితే ఎదుటి హృదయానికి చాల కష్టమేస్తుంది అయినా, ఆ మనిషికి అసలు ఏమాత్రం అభిమానం లేదు. బయట చీకట్లో వాన కురుస్తున్నది. దుఃఖపు ముసురు పట్టింది. వాన తెల్లారితేగాని వెలవదల్లే ఉంది.

"లోపలికి రానా! వానలో తడిస్తే మళ్ళా ఏదైనా వస్తుందేమో" అన్నాడాయన.

ఇదెవరి యిల్లూ ఏమిటీ కథ! అయినా లోపలికి రావచ్చా అంటున్నాడే? ఈ మనిషికి సిగ్గెట్లా లేదంట! ఇంతకీ ఈవచ్చిన వ్యక్తి ఎవరింటికి, ఎవరికోసంగాను ఈ అర్ధరాత్రి వానలో వచ్చాడనుకొంటున్నారు! ఆయన ఇల్లేనండిబాబు ఇక్కడ ఈ యింట్లో నేనేగ వుంట! నా కోసమని పాపం ఇంత ప్రయాసపడి వచ్చాడన్న మాట. ఈ వచ్చిన వ్యక్తి ఎవరనుకొంటున్నారేమిటి! నా ప్రియుడండీ బాబు నా ప్రియుడు. అంతకంటే కొంచెం మర్యాదగలమాటే వాడొచ్చు కాని, ఏముఖం పెట్టుకొని అంటాను — ఆయన నాభర్తఅని మీకీ పాటికి తెలిసే ఉండాలి. మేమిద్దరం చిన్నప్పుడు మంచి వయస్సులో ఉన్నప్పుడు అందరిలాగనే ప్రేమించుకొన్నాం. కాదు. ప్రేమించుకొన్నామనుకొన్నాం. ఎందుకంటే మనుషులు ఎప్పుడు ప్రేమించామనుకొంటూ, ఊహల్ని అపోహల్ని పెంచుకొంటుంటారు. ఆ తర్వాత మామూలుగా అందరికిమల్లేనే పెళ్ళిచేసికొన్నాం. బాగుంది కాని అక్కడినుండే కథ బాగోదు. మా కిద్దరికి పడిచచ్చేదికాదు. నువ్వు నాకొద్దంటే నువ్వునాకొద్దు అనుకునే వాళ్ళం ఎప్పుడూను. ఇంకేముంది! ఎప్పుడన్నా దారితప్పి చుట్టంచూపుగ వస్తూంటాడు యీ యింటికి — నా ప్రియుడు. అతను కొద్దో గొప్పో త్రాగుతాడని నాకు అనుమానం. అయినా యీవిషయమై నేనాయన్ని ఎప్పుడూ హెచ్చరించలేదు. విచిత్రమేమిటంటే, అట్లా ఏమన్నా త్రాగివచ్చిన రోజున, నా ఒడిలో తలపెట్టుకొని, 'క్షమించాననను — క్షమించానను' అని ఒకటేగోలపెడ్తాడు. పిచ్చినాన్నా! మనుషులు క్షమించలేరు అంటున్నాను నేను. అటువంటి క్షణాలలో మళ్ళీ పూర్వపు ప్రేమ అనుభూతులు కలిగేవి. ఈకథ నేనేమైనా సెంటిమెంటల్‌గా చెప్తుంటే క్షమించండి. ప్రపంచంలో ఏమన్నావుంటేగింటే సెంటిమెంట్స్ తప్ప ఇంకేమీ వుండవు. అందుకనే మనల్ని గురించిన కథలు బాగోవు. ఎబ్బెట్టుగ కట్టుకథల్లా వుంటవి. అయినా ఏంచేస్తాం. ఈ రాత్రి అలాంటిది.

"రోజూ ఇట్లా వానలో తడుస్తావెందుకు? న్యుమోనియా వస్తే?" అన్నాను

"వస్తేవచ్చిందిలే"

"ఆః ఆః! ఇప్పుడిట్లాగే అంటావ్. తర్వాత నా చావు నీకు తెలుస్తుందా" అన్నాను.''

"న్యుమోనియావస్తే నేనే చస్తాలే. మధ్యన నీవెందుకు చావాల్సి ఉంటుందని?"

"అదే తెలిస్తే బ్రతికేపోదును"

ఈమాట లన్నిటికి నా కళ్ళల్లో నీళ్ళు నిలచినయ్.

"ఎందుకు పద్దపద్దాక ఏడుస్తావ్? ఎవరు కొట్టారని" అన్నాడు.

"ఎవరు ఏడుస్తున్నారు! బలే బలే" అన్నాను తడికళ్ళతో నవ్వుతూ. అయినా నన్నీ వయసులో ఎవరు కొడతారు. నేనేమన్నా చిన్నపిల్లనా చితక పిల్లనా! అదృష్టం లేకపోయిందికానీ నలుగురు పిల్లల తల్లినయ్యుండేదాన్నికదూ! చిన్నప్పుడు అమ్మ కొట్టేది అల్లరి చేస్తే. అయినా, అసలే ఏడుస్తున్నవాళ్ళని ఎవళ్లు మాత్రం కొట్టారు. ఆయన దృష్టిలో నే నెప్పుడూ ఏడుపు ముఖం పెట్టుక్కూర్చుంటా నన్న మాట. ఆయన తలలోంచి నీళ్ళు కార్తున్నవి. కోటు ముద్ద ముద్దయి పోయింది. కోటు జేబులో సిగరెట్లు తడిచి పోలేదని సంతృప్తిగ నవ్వు కొన్నాడు.

''ముందు పొడిబట్ట లేమైనా ఉంటే ఇవ్వు. తర్వాత టీ పెట్టు''

పొడిబట్టలు ఇచ్చాను. పాలులేవన్నాను.

''ఎందుకని లేవు? నేను వస్తానని తెలీదా?"

"అవును! తమరు వస్తారని, నన్ను ముద్దుపెట్టుకొంటారని, వారం రోజుల నుంచీ తెలుసు. రేపో, ఇవ్వాళో ఎప్పుడోవొకప్పుడు టెలిగ్రాంలా వస్తారని అను కొంటూనే వున్నాను. కాని ఇవ్వాళ ఇక రారని అపోహపడ్డాను; టెలిగ్రాం ఎప్పుడు వచ్చేది ఎవళ్ళకైనా ఎట్లాతెలుస్తుంది. కాని గమ్మత్తుగా ఇవ్వాళేవచ్చేళారు ఇల్లు గుర్తుపట్ట గలిగారా? ఎవర్నైనా వాకబు చేయలేక పోయారా పాపం ఎంత శ్రమపడి పోయారో నాకోసం" అని దెప్పి పొడిచాను. నాలాంటి ఆడవాళ్ళందరూ ఇవేమాటల్ని అంటుంటారు. ఈ మాట లంటున్నప్పుడు నాకు కళ్ళల్లోంచి. ముక్కులోంచి నీళ్ళు వచ్చాయి. కంఠంలో మంచుగడ్డ పెట్టినట్లుంది.

''మంచిపనే! ఇక్కడకు వస్తానని నాకైనా ముందుగా ఎట్లా తెలుస్తుంది? అయినా పాలు లేక పోయినా పెద్దగ పట్టింపేమీ లేదు. డికాషన్ ఇచ్చేయ్ చాలు" అన్నాడు.

స్టౌవెలిగించి అట్లాగే చేసాను. కషాయంలో కాస్త పంచదార కలుపు కొని త్రాగేసాడు. సిగరెట్ వెలిగించాడు. ఈ విధంగ ఆయన విపదార్థాల్ని వాడటం చూస్తే నాకేమిటో ఒద్దొద్దని చెప్పా లనిపించేది. కాని ఈ మాటల్ని వింటాడా ఆ అమృతమూర్తి!

"ఈ స్టౌ చూస్తే నీవు గుర్తుకు వస్తావు" అన్నాడు.

"అవును, అది నీగుండెల్లో నేను వెలిగించిన కుంపటి''

"ఆ కుంపట్లో పిడకలు రాజుకొంటేనేగాని నీకు టీ తయారవవ్వు" అని తలకాయ వంచుకొని అన్నాను. మనిషిని ఏడ్పించాలంటే క్షణంలో ఏడ్పించ గలను అయినా, అసలే ఏడుస్తున్న వాళ్ళని ఇంకా ఎవరేడ్పిస్తారు. అతను నాప్రక్కన కూర్చుని చీర చెరుగు ముడులువేస్తూ తీస్తూ, ''అయితే నన్ను గురించి నీకేమీ తెలీదన్నమాట" అని కోపంతో గొణుక్కున్నాడు. ఈ మాటకు మధ్యలో ఎన్నో డైలాగులు ఎగిరి పోయినయ్. ఒకానొక సన్నివేశంలో మాటలు చాల తక్కువ, కాని నేను ఒట్టి వాగుడు కాయని.

''ఎందుకని తెలీదు! నీవు నన్ను ప్రేమిస్తున్నావని చెపితేనే తెలిసింది. నీవు ఏమీ చెయ్యలేని అసమర్థుడివని, ఒక భావకవివని, ఎవర్ని ఎందుకని

[తరువాయి 17వ పేజీ]

# నాగులేరూ!

ఓ నాగులేరూ ఓహో నాగులేరూ!

బ్రహ్మనాయని హృదయ వేదన,
క్రూర నాయకీ మృధారాధన,
మరణించిన, విహరించిన నరసింగుని శిరము!
విరమింపక, వెలిపించిన బాల చంద్రుని కరము.-
హోరా హోరిగ చెలరేగిన పోరాటం
వెనుకాడని వీరుల ఆరాటం
అణగారిన వికలాంగుల హాహా కారం
కనబారిన సంగర ప్రాంగణ ఘోరాకారం,-
విరిగిన కరములు, తరిగిన చరణమ్ములు,
విరజిమ్మబడిన తరస భారమ్ములు,
వీరుల దారులు, కన్నీరుల ధారలు
ధీరుల బాధలు-పోరుల గాథలు.
చిమ్మిన చిరువేడి రుధిరమ్ములే
కుమ్మిన కుంభ వర్షమై నిను పొంగించెనా?
రేగిన శల్యపు టంకపు పుప్పొడులే
పోసిన బుట్టల మట్టయి నిను పూడ్చెనా?
ప్రళయ కాలతాండవ ప్రచండ జ్వాలాక్షుని
పీకపైన నెగురు పెను పునుకల పేరును బోలిన-
సమర సమయ సంభ్రమాట్ట హాసిత మహామంత్రిణీ
ధవళ దంత ధామ మాల రాలి నేలను గూలెనా?
మురిగిన పేగులు! మూగిన ఈగలు
చీము నెత్తు రురలి చీకినమేనులు,
కాకులగ్రద్దల, కుక్కల నక్కలకూతలబారు, రోతలపోరు!
పరలోక గతులయిన పతులకై
సప్తార్చికి భక్తులయిన సతులు!
సురలోక గతులయిన సుతులకై
విరామ మెరుగక విలపించిన మాతలు!
వ్యర్థ మతగాఢ మౌఢ్యమ్మున రెచ్చెను, హెచ్చెను
అర్థ రహితావేశ స్వేచ్ఛా మ్లేచ్ఛమ్ములు!
ఘోర భక్షణ దీక్షారూక్షమ్మున రగిలెను, పగిలెను
ఆహవ భావానల నగ నాగోగ్రమ్ములు!

—శ్రీ ధనేకుల వెంకటేశ్వరరావు

# సవినయాంజలి



మనజాతీయమహాకవి, గురుదేవులు ఆయన రవీంద్రనాథ టాగూరు శతవార్షికోత్సవ సందర్భాన ఈ సాయంతనం ఏవో నాలుగు ముక్కలు చెప్పవలసిందిగా అడగడం నాకెంతో గౌరవం. ఇంతటి గౌరవ స్వీకారానికి తగిన అర్హత నాకుందో లేదో నాకు తెలియదు--ఎందుకంటే ఆ మహా వ్యక్తికి న్యాయం కలిగించ గలిగే పాండిత్యం గాని, ప్రతిభ గాని నాకు లేదని నే నెఱుగుదును, అంతేకాదు ఇంతటి మహాసభలో నేను మాట్లాడ్డం వల్ల, నా కంటె ఎక్కువ యోగ్యతలు గల్ల మరొకరికి అవకాశందక్కకుండా పోయిందని నేను బాధ పడకుండా వుండాలిగదా. ఆ కవి, కళను నిర్జీవమైన సూత్రాలతో వివరించడం కాదు యీనాడు వాంఛించేది. మనలను పురోగమింప జేసే సజీవమైన ఆవేశాన్ని మన మందులో దర్శించాలి.

ఈ సాయంతనం మీ కుపన్యసించే అర్హతలు నాకున్నట్లుగా నేను పోజు వేశానా? అనే ప్రశ్నకు స్పష్టమైన సమాధానం నాకులేదు. ఈ నాటి శోచనీయ స్థితి ఏంటంటే కవి, ప్రవక్త తమ సొంత దేశంలో గౌరవానికి నోచుకోవటం లేదు. మన చుట్టూ సంస్కృతి క్షీణిస్తూన్న యుగంలో మనమీనాడు జీవిస్తున్నాం. ఇది ఎంతో నింజిలి పడవలసిన విషయం. ఇలాంటి పరిస్థితు లాగిపోవాలి అని గొంతెత్తి అరవడానికి బదులుగా మనమందరం ముందుకు తోసుకు పోతున్నాం. నిర్దాక్షిణ్యంగా తోసుక పోతున్నాం. నిష్ప్రయోజనం, క్షణికం అయిన విలువలను వాటు గరచుక పోతున్నాం మరి.

ఇటువంటి సందర్భంలో నేనొక బాధ్యతను మీద వేసుకుంటున్నాను, అందుకు నా యోగ్యతేంటంటే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో నాకో మంత్రిత్వం వుండటం. ఈ పదవి ఇంత ఉన్నత గౌర వార్హతను కలిగిస్తుందా? అనేది గణించవలసిన ప్రశ్న. ఆలాంటప్పుడు నాకొకే ఒక శరణ్యం యావత్ సంఘటనలను సక్రమ పరచే ఈశ్వర సంకల్పానికి తల వగ్గడమే. ఇంత వరకు నేను నా జీవితంలో అన్నిటి కంటె ఉన్నతమైన మంచిని కాకుండా సహజంగా తక్కువ స్థాయిలో వుండే మంచినే అన్వేషిస్తున్నానని నేను బాగా ఎఱుగుదును. నేను సాధన చేస్తుంది రాజకీయాలు. రాజకీయ జ్ఞానం ద్వితీయం. బ్రహ్మజ్ఞానం అద్వితీయం బ్రహ్మ జ్ఞానం అంటే భగవంతుణ్ణి తెలుసుకోడం. నా పాశ్చాత్య మిత్రులీ అభిప్రాయాన్ని అంత తొందరగా అంగీకరించరేమో! ఎందుకంటే చారిత్రిక పరంపర జ్ఞానం, లౌకిక గమ్యం యూరప్ దేశాల కిచ్చినవాడు రాజు లేక రాజకీయ వేత్త. అట్లా కాకుండా, పారలౌకిక సత్యాన్ని అన్వేషించేది భారతీయ మార్గం. ఆ మార్గాన్నే ఋషు లనుసరించారు ఆది, అంతంలేని ఆకాశంలో నిలచి, వారు సర్వాన్ని భగవానుడు చేసే నిరంతర నృత్యంగా దర్శించారు ఈ అకాశంలోనే కర్షకులు, వ్యాపారులు, పాలకులు, రాజులు, రాజకీయ వేత్తలు వారి వారి లౌకిక పాత్రలను నిర్వహిస్తారు. కాని వీరందరుకూడా ఆద్యంతాలు లేని ఆ దైవ జ్ఞానం కోసం నిరంతరం సతపోరు తుంటారు

కనుక నే నీరోజు సవినయంగా లేచి నుంచుంటున్నాను. గురుదేవులు రవీంద్రనాథ టాగూరుగారి చిరస్థాయిగా నిలచే రచనలలోని స్వేచ్ఛను అమరత్వాన్ని, సత్యాన్ని, దేవుణ్ణి, శాశ్వత సందేశాన్ని నృత్య గీతాల రూపంలో ప్రదర్శించిన యీ కళాకారులను నా కుటుంబ సంప్రదాయాను సారంగ, ఆనంద గజపతిగారు నాకిచ్చిపోయిన పారం పర్యాను సారంగ గౌరవిస్తున్నాను.

(గురుదేవుని శతజయంతోత్సవాల సందర్భమున పి. వి. జి. రాజుగారి ప్రసంగ సారాంశము)

---

## 'దొంగ'

ఒకవిధంగా మనమంతా దొంగలమని నేను చెపుతాను. నా స్వంత తక్షణావసరమునకు అవసరము లేనిదానిని తీసుకుని యుంచుకుంటే నేను యితరులవద్దనుండి దొంగిలించినట్లే. మన నిత్య జీవితమునకు అవసరమయ్యేంతగా ప్రకృతి వుత్పత్తి చేయడమే ప్రకృతియొక్క మూలవిధానం. ప్రతివాడూ తనకు కావలసినంతగా మాత్రమే తీసుకొన్నచో ఈ ప్రపంచంలో నిరుపేదతనము గాని, ఆకలితో చనిపోయే మనిషిగాని యుండడు.

—గాంధీజీ

# నవలాకారుడి

## నాలుగో పరిమాణం

శ్రీ బుచ్చిబాబు

ఎవరు రచయిత? రచయిత ప్రత్యేకలక్షణాలేవో మనందరికీ కొద్దో గొప్పో అభిప్రాయం వుంది. జీవితంపట్ల ఒక దృక్పథం అలవరచుకుని దాన్ని ఇతరులతో పంచుకొని, వారిచేత అంగీకరించేటట్లు చెయ్యడంకోసం రచనకి పూనుకునే వ్యక్తి రచయిత. మానవత్వం నిరంతరం సాగించే అల్లికలో తనూ ఒక పోగు సమకూరుస్తాడు. ఆ పోగు స్వరూపం ఏదైనా కావచ్చు; వొక అపూర్వ అనుభవం, సామాన్యమైన అనుభవాన్ని కొత్త కోణంలోంచి చూడగలగడం, క్షణం దర్శనమిచ్చి శాశ్వతంగా ముద్రవేసే అనుభూతి చిత్రణం. జీవితం వొత్తిడికి సర్వేంద్రియాలూ కలిసి చేసే ఆర్భాటం చూపటం,—వీటిల్లో ఏదన్నా కావచ్చు దాన్ని అందంగా, శక్తివంతంగాకలవరపరచి మరుపురాని మాటల్లో చెప్పగలవాడు రచయిత.

ఈ సాధనకి పరికరాలేమిటో కూడా మనకి తెలుసు. అనుభవం, ఊహాశక్తి. జీవితంపట్ల కుతూహలం. ప్రయోజనం ప్రశంశ లేకుండా మానవ హృదయాన్ని తరిచిచూడాలన్న వైజ్ఞానిక తృష్ణ. శాస్త్ర పాండిత్యం, సాంప్రదాయంతో, భాషతో కొంత పరిచయం, చరిత్ర సమాజం పోకడని పరిశోధించె తార్కికజ్ఞానం, మానవ స్వభావంలోని వైవిధ్యాన్ని ప్రదర్శించే ప్రజ్ఞ బాహ్యజగత్తులోని గందరగోళం తొలగించి, విలువగల భాగాలను, తన్మయముతో చిత్రించ గలగడం అర్థం. అందం. ధ్వనిగల పదాలని సముచిత సందర్భంలో ఏరి వాడగలగడం అంతరంగంలో మరుగుపడ్డ మానవుడి ఆశ నైరాశ్యాలు వింత ప్రవర్తన, వెనకదాగిన సంక్షోభం, ఉద్రేకాల ఒరవు. సాంద్రత వీటితో నైతిక చింతన ముడిపెట్టి జీవితానికి విలువ కట్టగలగడం ఇవి రచయితకుండవల్సిన సంపత్తి. ఆ రచయిత కవికావచ్చు కథకుడు కావొచ్చు నవలా రచయిత నాటకకర్త కావొచ్చు ఇవన్నీ వైద్యవృత్తిలో డాక్టరుడిగ్రీల మాదిరి కనపడవచ్చు. డిగ్రీలున్నన్న, వైద్యుడికి చేతిచలవ వుండాలన్నట్లు రచయితకి ప్రతిభకావాలి. అది వున్నవాడు గొప్ప రచయిత.

కొందరు రచయితలు అనేకమైన సాహిత్యస్వరూపాలను సాధించినా త్వరలోనే వారిస్థానం వొక రకంలో నిర్ణీతమై పోతుంది. ఒక రచయిత కొన్ని నాటికలు, కొన్నికథలు, అప్పుడప్పుడు ఖండకావ్యాలు, విమర్శ వ్యాసాలు వ్రాసినా, కథకుడుగానో, నాటక కర్తగానో ఖ్యాతిచెంది, పాఠకలోకానికి సుపరిచితుడవుతాడు. చెకోవ్ నాటికలువ్రాసినా కథకుడుగా ప్రసిద్ధిచెందాడు; కీట్సు, షెల్లీలు నాటకాలు వ్రాసినా కవులుగా పరిగణింప బడతారు, థామస్ హార్డీ కథలు కూడా వ్రాసినా, నవలా రచయితగా చెప్పుకుంటారు. ఆల్డస్ హక్స్లీ నవల కథలు ఖండకావ్యాలు వ్రాసినా, వ్యాసకర్తగా ఖ్యాతి చెందాడు. హాస్యధోరణిలో నవలలు, వ్యాసాలు వ్రాసిన జె. బి. ప్రీస్ట్లీ తాత్విక



చింతనతో కూడుకొన్న నాటకకర్తగా పేరు తెచ్చుకున్నాడు. సామర్ సెట్ మాఘమ్, చాలానాటకాలు నవలు వ్రాసినా. కథకుడుగా ఖ్యాతిచెందాడు. డాస్టోవిస్కీ, శరత్, లారెన్స్, ఆల్బర్ట్ కామస్' మార్సెల్ ప్రూస్ట్, కాన్‌రాడ్, నవలా రచయితలు ప్రేమ్‌చంద్, కాథిరన్ మాన్స్‌ఫీల్డ్, గైడిమొపాసా కథకులు, వివిధసాహితీ ప్రక్రియలలో విజయం సాధించినా టాగూర్, గెదేలు కవులు.

మనం మొదట్లో పేర్కొన్న లక్షణాలు, ప్రత్యేకశక్తులు, ఈ రచయితలందరిలోనూ సమంగావున్నా, వొకరు కథకులు, మరివొకరు నవలా రచయిత, మూడోవారు నాటకర్త. నాటక కర్తలోనూ కథకుడిలోనూ వుండేశక్తులు లక్షణాలు ఉండటమే కాకుండా, వాటిలో అంత ముఖ్యంకాని కొన్ని ప్రత్యేకమైన శక్తులు నవలా రచయితలో ఏవన్నా వున్నాయా అంటే అవి ఎట్లాంటివి; మిగతారచయితలలోలేని ప్రత్యేకత నవలాకారుడిలో ఏదోవుండాలి. దాని స్వరూపం ఏమిటి?

ఎందరెందరో నవలాకారులు. వారి విమర్శకులు. నవలా రచనగురించి జేసిన నిర్వచనాలు వెలిబుచ్చిన విమర్శలు చూశాను. పాత్రచిత్రణం సమకాలిక జీవితసమస్యల చిత్రణం వర్ణనాశక్తి తాత్విక సిద్ధాంతాల పరిశీలన, ఆదర్శాల ప్రతి పాదన గాఢంగా జీవించాలన్న తృష్ణ రేకెత్తించడం అద్భుతరసాన్ని చూపడం. అపూర్వసంఘటనల కల్పన, వింతప్రకృతి విభజన, జీవిత సమస్యల పరిష్కారం "ఇల్లావుంది. బ్రతుకు" అని గుండెలకి హత్తుకునేటట్లు శ్వాస విలిపివేసేటట్లు చిత్రించడం - ఇల్లాగ నవలారచయిత ప్రత్యేకశక్తుల్ని పేర్కొన్నారు. కాని వాటిల్లో కథకుడిలో నాటకర్తలో లేని ప్రత్యేక లక్షణాలు నాకేవీ కనబడలేదు. ఇవన్నీ కథకుడూ సాధిస్తాడు. నాటకర్త సాధిస్తాడు? మరి నవలా రచయితలో వుండే ప్రత్యేకమైన శక్తులేవి? నాకీ విషయంపట్ల తృప్తికరమైన సమాధానం దొరకలేదు.

టాల్‌స్టాయ్ నాటకలువ్రాశాడు; వ్యాసాలు వ్రాశాడు. కాని నవలా రచయితగా ఎరుగుదుం, ఆయన 'వార్ ఎండ్ పీస్' అనే నవల ప్రపంచ సాహిత్యంలో గొప్పనవలగా స్థిరపడిపోయింది. అదిచాలా పెద్దనవల వెయ్యిపుటలు మించిన గ్రంథం అల్లాగే రోమేన్ రోలండ్‌ది 'జీన్ క్రిస్టఫి' పెద్దనవల. థామస్ మాన్‌ది 'బడెన్‌బ్రూక్స్' మరో పెద్దనవల. కథని వెయ్యి పేజీలకు పెంచగలగడం నవలారచయిత ప్రత్యేకత అనిపించవొచ్చు పెంచడం మటుకే అయితే, ఆ పని కథకుడూ' నాటకర్త చెయ్యలేరా? నవలకి దగా ప్రచారం వుందనుకున్న రచయిత దానికి పూనుకోగలడు. పి. జి. వుడ్‌హౌస్ నవలలు ఈ విధంగా పెంచినకథలే. డికెన్స్. కథలో కథ ఇరికించి విస్తీర్ణం పెంచేవాడు. విస్తీర్ణం నవల ప్రత్యేకత అనలేం. ప్రచురించే వారికోర్కె మన్నించి రోజుకో నవలచొప్పున వ్రాయగల అలెగ్జాండర్ డ్యూమా ఎడ్గర్ వాలాస్, లాంటిరచయితలున్నారు.

వెనుకటి శతాబ్దంలో వారం వారం వెలువడే పత్రికల కోసం వ్రాసేవారు నవలలు - సంపాదకులు పెంచమని కోరేవారు, సుదీర్ఘమైన వృత్తాంతాలు చదివేటంత వోపిక, తీరుబడి, ఆశక్తి ఆనాటి పాఠకులకుండేవి, అందుకని, ఐదొందలు పుటలకి తక్కువగా రచిస్తే, ఆ గ్రంథం నవలని అని పించుకోదు. ధనిక కుటుంబాలలో, నవలా పఠనంతప్ప వేరే కాలక్షేపం స్త్రీలకుండేది కాదు. వారి వినోదం కోసమే నవల పుట్టిందన్న సిద్ధాంతమూవుంది.

(సశేషం)

# వాగ్దానాలను విస్మరించిన శ్రీ మొరార్జీ బడ్జెటు

మూడవ సాధారణ ఎన్నికలలో సోషలిస్టు నినాదముతో దిగ్విజయాన్ని సాధించి అధికారాన్ని కైవశం చేసుకున్న కాంగ్రెసు పార్టీ పార్లమెంటులో ప్రవేశపెట్టిన బడ్జెట్టులోని పన్నుల ప్రతిపాదనలు సోషలిజం గమ్యాన్ని చేరుటకు పనికివచ్చేవిగా లేవు. కార్పొరేట్ టాక్సులో 5% హెచ్చింపు కొద్దిగా ధైర్యంగా చేయబడ్డా, ప్రొఫెసర్ నికోలస్ కాల్డర్ సలహా మేరకు శ్రీ టి. టి. కృష్ణమాచారిచే ప్రతిపాదించబడ్డ ఖర్చు పన్నును ఎందుకు తొలగించారో తెలియదు. డివిడెండ్లు, అంతర్ కార్పొరేషన్ల పెట్టుబడులలో తగ్గింపుల ఆవశ్యత ఎందుకు గల్గినదో?

ఆర్థిక మంత్రిచే క్రొత్తగా ప్రతిపాదించబడిన పన్నుల వల్ల రెవిన్యూ ఆదాయం రు 71 కోట్లు పెరిగి రెవిన్యూ లోటును భర్తీ చేస్తున్నది, ప్రత్యక్షపన్నుల వల్ల రు 27. 2 కోట్లున్నూ, పరోక్ష పన్నులవల్ల రు 44. 5 కోట్లు అధికంగా లభిస్తుంది. దేశంలో ప్రజా సామాన్యం పరోక్ష పన్నులను తగ్గించి, ప్రత్యక్ష పన్నులను పెంచవలసినదిగా కోరుచున్నా, వాటి స్థానాలను తారుమారు చేసి బడ్జెటు ప్రసంగాన్ని కొనసాగించ గల్గారు ఆర్థిక

(తరువాయి 15 వ పేజీలో)

మంత్రి, మొత్తం బడ్జెటును పరిశీలిస్తే బ్రిటిషు సామ్రాజ్య వాదపు నాటినుండి వస్తున్న విధానాలే. రెవిన్యూ ఆదాయాలను తక్కువ అంచనా వేయడం, ఖర్చులను ఎక్కువ అంచనాకట్టి క్రొత్త పన్నులకు కారణం చూపడం అనుసరించి నట్లగుపిస్తున్నది.

గతానుభవాన్ని దృష్టిలో పెట్టుకున్నపుడు రెవిన్యూ ఆదాయం రు 71 కోట్లు తక్కువవని తప్పని సరిగా ఇంకా ఎక్కువ ఆదాయం రాగలదని తెలుచున్నది, ఎదోరకంగా ప్లానింగు అంచనా రు 1100 కోట్లకు సరిపుచ్చి సంతోషిస్తే ప్రయోజనం లేదు. ప్రతి సాంవత్సరిక బడ్జెటులోను క్రొత్తపన్నులు అనివార్యం కావడం విచారకరం వాటిని యిష్టమున్నా, లేక పోయినా అంగీకరించే దుస్థితిలో ప్రజలుండటం కొంత కారణము. ప్రభుత్వపు ఖర్చులో కొంత తగ్గించుకొని, తద్వారా లోటును భర్తీ చేసుకొనే సత్సాంప్రదాయాలకు అలవాటు పడలేదు.

గతంలో కొంతవరకు అభ్యుదయమైన, సోషలిజానికి దాపుగా శ్రీ టి. టి. కృష్ణమాచారిగారి బడ్జెటు ప్రతిపాదన లుండేడి. ప్రజాసామన్యంపై సభరింపరానంత పన్నులను వేయనవసరము లేదని, పెద్ద కంపెనీలు చెల్లించవలసిన పన్నుల ఎగవేతల నరికట్ట కల్గితే బడ్జెటులోటునును పూడ్చవచ్చునని శ్రీ కృష్ణమాచారి చెప్పారు.

మన ఆర్థికాభివృద్ధి చాల తక్కువ స్థాయిలో ఉన్న మాట వాస్తవమే. భారీపరిశ్రమాభి వృద్ధికి కృషిచేస్తున్నందువల్ల పుచ్చుకొనే స్థాయిలోనే మన మున్నాము. కానిమనంపార్టీనియంతృత్వపు రాజ్యాన్ని నడపడంలేదు. ప్రజాస్వామ్య పద్ధతిలో ప్రభుత్వాన్ని నడపుచున్నాం. ప్రజాస్వామ్య ప్రభుత్వంలో ప్రైవేటు సంస్థలను అంగీకరించాం. ప్రైవేటు సంస్థలకు లాభాలు ప్రధానంగాని, దేశ క్షేమం, అభివృద్ధి ముఖ్యంగాదు.

దురదృష్టవశాత్తు ఆర్థిక మంత్రి పది లక్షల మంది ఆదాయపు పన్ను చెల్లించు వారిని అతి సూక్ష్మమైన అంకెగా త్రోసివేశారు. వారి వాటాకు వచ్చు భారాన్ని వారు మోయవలసినదిగా శ్రీ మొరార్జీ చెప్పడం హాస్యాస్పదం. మిగిలిపోయిన నలుబదినాల్గు కోట్ల ప్రజానీకం తమ వంతువాటా కంటె అధిక పన్నుల భారాన్ని తాము మోయలేకున్నామని చెప్పున్నా వారి

# కళాతత్వము

కేంద్ర లలితకళా ఎకాడమీ యొక్క కార్య వర్గ సమావేశాలను, అఖిలసభ్య సమావేశాలను హైదరాబాదులో పెడుతున్నందుకు, గుజరాత్ గవర్నరు, కేంద్ర లలిత కళా ఎకాడమీ అధ్యక్షులు అయిన నవాబ్ మెహ్దీ నవాజ్ జంగ్ గారికి మనం నిజంగా కృతజ్ఞులం. ఈ సమావేశాలకు విచ్చేసిన సమర్థులైన కళాకారులకు, విమర్శకులకు తదితర ప్రసిద్ధ పండితులకు ఆతిథ్యమిచ్చే అవకాశం మనకివ్వడంలో ఆయన సుహృద్భావం వెళ్ళడవుతోంది. ఈ రాష్ట్రంలో వున్న కళాకారులకు, కళా రంగంలో కృషిచేసే తదితర వ్యక్తులకు పరస్పర సంబంధాలు నెలకొల్పడమే కాకుండ, ఈ రాష్ట్రంలో కళా చైతన్యానికి అభిరుచికి అనుకూల వాతావరణాన్ని సృష్టించడంలో

-:మూలం:-

ఆంధ్రప్రదేశ్ కళాకారుల సమావేశంలో గౌరవ నీయులయిన ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖా మాత్యులు

## శ్రీ పి. వి. జి. రాజుగారి

### అధ్యక్షోపన్యాసం

ఈ సమావేశాలెంతగానో సహాయపడతయి. మూస పోయడానికి వీలున్న శిల్పము, చిత్రలేఖనము మొదలయిన కళలు భాషాది ప్రాంతీయ పరిమితులకు లోనుగావు, అట్టి కళా రంగాలలో పనిచేస్తున్న వ్యక్తుల నొకచోట సమావేశపరచడం వల్ల వివిధ ప్రాంతాల ప్రజలమధ్య సాంస్కృతిక సౌభ్రాతృత్వ సంబంధాలు బలీయమవుతాయి. ఆ సంబంధాలు, మనదేశంలో సాంస్కృతిక ఏకత్వాన్ని పెంపొందించడానికి ఎంతో అవసరం మతాతత్వం వల్లనేం, నిగూఢంగా దాగివుండి అప్పుడప్పుడు తమ పైశాచిక శిరస్సుల నెత్తుతూన్న దుష్టశక్తులవల్ల నైతేనేం కలుగుతూన్న, కలగడానికవకాశమున్న ప్రమాదానికి ఆ సంబంధాలు విరుగుడుగా పనిచేయ వచ్చు.

జీవితంలో అన్నివిషయాలకువలె కళకూడా ఒక గొప్ప సంక్షోభాన్ని ఎదుర్కొంటోంది. అందుకు కారణం నవ సాంఘిక పరిణామంలో పూర్వజీవిత పరిస్థితులు వీగి పోతూండటం. ఈ పరిణామంకూడా ప్రకృతివలన సృష్టించ బడిందె. పూర్వీకుల వలన భావించ బడిన పద్ధతి ప్రకారం ఇహలోక కాలంలో పెంపొందాయి. ఆ నాటి సమాజం జీవించిన కాలగమనం నేడున్న దానికంటె భిన్నమైంది. నాటికళలు—మతానికి సంబంధించినవి సంబంధించనివి కూడా—రాజకీయాధికారాన్ని, సంఘ ప్రతిష్ఠను కేంద్రంగా పెట్టుకుని పెంపొందాయి. కనుక భారతీయ కళను పరిశీలించాలంటే చారిత్రక జ్ఞానం కావాలి. ఏయే కాలంలో గాంధార, బౌద్ధ, మహ్మదీయ, మొగల్ కళా స్వరూపాలు పరిణామం చెందాయో నిపుణులు స్పష్టంగ చెప్ప గలుగుతారు.

ఏది ఎట్లావున్న, చారిత్రక విలక్షణాభివ్యక్తను బట్టి, తత్పరిణామ విధానాన్నిబట్టి చూస్తే గత 250 సంవత్సరాల కాలాన్ని నాసియుగంగానే పరిగణించవచ్చు. ఈ కాలంలో, ఇంత వరకు భారత దేశంలో ప్రముఖంగా లేక ప్రాతిపదికగా నిలిచే కళాసృష్టి ఆవిర్భవించలేదనే చెప్పాలి. ఆంగ్ల విజేత విచ్చేశాడు, మనదేశాన్ని ఒక విలక్షణమైన స్థితికి తీసుక పోయాడు. ఆ స్థితిలో, సర్వకాలంగా చైతన్యవంతమైయున్న మన దేశీయ సృజన శక్తులనే జీవనదులు వట్టిపోయాయి కనుక భారతీయ కళకు, దాని స్వరూపాలకు, దానిని ప్రేరేపించిన ఉద్దేశాలకు సంబంధించిన ఏ చర్చయినా కానివ్వండి చారిత్రిక సందర్భాలలో గత చారిత్రిక పరిధుల్లో మాత్రమే తిరుగ గలుగుతుంది. హిందూదేశం మీద పడిన పాశ్చాత్య ప్రభావం తీరెల్లా సాగలేదు. మన చుట్టూవున్న పరిసరాలను క్రమంగా అవగాహనం చేసుకుంటున్నాం. అందువల్ల వివిధమైన పూర్వ కళా ప్రాథమిక స్వరూపాలను మేళవించ వలసిన అవసరం కలిగింది. ఆ అవసరంలో కళా పునరుజ్జీవనకు పోరాటం ఆరంభ మయింది.

కళలో—ప్రత్యేకించి మతానికి సంబంధించిన కళలో సంకేతాలు లోతైన ఆధ్యాత్మిక సత్యాన్ని ప్రకటిస్తాయి. ఆ సంకేతాల ప్రమాణంలోనే కళాస్రష్ట తన కళానైపుణ్యాన్ని సమర్థించుకో

చూస్తాడు. మత సంకేతం మానవ చైతన్య తంత్రులనుస్పందించడానికి ప్రయత్నిస్తుంది. ఆ స్పందన వల్ల మేధ, హావభావాలు సమ్మేళనం చెంది భక్తి సాగరంలో లీన మవుతయి. కనుక "మతకళ" భక్తులకు మాత్రమే అవగత మవుతుంది. విశ్వాసం లేని వారికి అర్థరహితంగా వుంటుంది. చైతన్యానికి, మత సంకేతానికి ఏలాంటి "లంకె" వుండదు గనుక వారికది అర్థం కాదు. సాంకేతిక స్వరూపంలో వున్న యీ కళ ఒక విధానాన్ని సృష్టించుకుంది. ఆ విధానంలో ఒకే నమోనా మరల మరల రావడం జరుగుతుంది. ఆ విధానంలో నుంచి అలంకారికమైన కళాస్వరూపం అవతరించడం జరిగింది. అలా అవతరించనప్పుడు ఒకే నమోనాను తిరిగి తిరిగి చిత్రించే

-:అనువాదం:-

## శ్రీ పి. హనుమయ్య

విధానమే స్థిరపడి పోటం జరిగింది.

కనుక శిల్పకళయొక్క మహాయుగాన్ని ప్రేరేపించింది ప్రాచ్య దేశీయ మానసిక తృష్ణ. ఆ మనస్సు అభివ్యక్తమవడానికి సర్వాన్ని యీశ్వరమయంగ అంగీకరించింది. విభిన్న రూపాలలో వున్న యావత్సృష్టిని అంగీకరించింది. అలా అంగీకరించడంద్వారా అనంత భావములో లీనం చెందడానికి ప్రయత్నించింది. ఇది కళాప్రారంభదశలో జరిగింది. ఈ దశ ఒకే నమూనా తిరిగి తిరిగి చిత్రించే విధానానికి మాత్రమే తావిచ్చింది. ఆ విధానంలో ఏదైనా గాంభీర్యతవుంటే - అది అపరిమితమైన పరిమాణం ప్రేక్షకునిలో కలిగించె ప్రభావం మాత్రమే. ఇందులోకి కొన్నిసార్లు

ఈ నాడీ దేశంలో కళాకారు డెదుర్కొంటున్న ప్రతి సమస్యలను గ్రహించు కోడానికి గత చరిత్రను గుర్తుపెట్టుకోడం అవసరం. వలసి నంత విశ్రాంతిని యివ్వగలిగిన సమాజంలో మాత్రమే కళాసృష్టి సాధ్య పడుతుందనేది ఉద్ఘాటనీయమైన సత్యం. అట్లా అంటంలో కళ మానవుని చైతన్యానికి సాహజమైనది కాదని అర్థంకాదు. ఎందుకంటే చాల అనాగరికంగా వున్న సమాజాల్లో కూడా కారుడవత రిస్తాడు. తన చైతన్యాని కనుగుణంగా కళా ఖండాలను నిర్మించడానికి కళాకారునకు స్వేచ్ఛ యివ్వబడుతుంది. కళా సృష్టికి కావలసిన ఆవేశం మనచుట్టూత వున్న సాహజ వస్తువుల నుండే గ్రహింపబడుతుంది. కాని కళాకారుడు కళా వస్తు స్వభావాన్ని లోకా తీతంగ చేస్తాడు. కళా కారుడు తనను గురించి. తాను సృష్టిస్తున్న కళా వస్తువును గురించి ఎక్కువ చైతన్య వంతు డవుతాడు. కనుక మనలో మనుషుల్ని రెండు రకాలగా విభజింప వలసి వుంది. మామూలుగ మానవ చైతన్యాన్ని ప్రేరేపించే దృగ్గోచర వస్తుస్వరూపాలను అధిగ మించి పోయి ప్రకృతిని అర్థం చేసుకోవాలనే నిజమైన తృష్ణ గలవారొక రకం. సరాసరి గప్రకృతికి మూలమైన సత్యాన్ని సరాసరి అవగతం చేసుకో గలిగిన పరిణత చైతన్య వంతు లింకోరకం వారే కళాకారులు కనుక నిజమైన కళాకారు డసామాన్యుడు. కళావృష్టి అంటే లోకాతీతమైన సత్యాన్ని ఆకళింప చేసు కోడం కళాసృష్టి ఇంద్రియజ్ఞాన సూత్రలలోనికి వొదుగదు. ఇంద్రియాను భూతిని లోకోత్తరమైన అవధుల్లోకి తీసుకపోతుంది. ఇంద్రియాలకు గోచరంకాని సత్యాన్ని చేరుకుంటుంది, ఇటువంటి సంపూర్ణత్వం సాధించడం మనలో ప్రతిఒక్కరికి సాధ్యంకాదు. కనుకనే మనలాంటి తక్కువస్థాయి మనుషునాకుసృష్టి రహస్యాలను ఆవిష్కరించే కళాకారులకు మనం అంజలి పడంతా. నియమాలను తెలుసుకొంటూ కళాఖండాలను పరిశీలిస్తూ, తార్కిక శక్తిని, భావనా శక్తిని సుశిక్షితం చేసుకొంటూ, చైతన్యాన్ని వర్ధిల్ల చేసుకొని, క్రమపరచుకొని, అభ్యాసం, సంస్కారంపొందిన సామాన్య వ్యక్తికూడా నూతనరస ప్రపంచంలోకి చొచ్చుకపోవచ్చు. అప్పుడాతడు కళాస్వాదనకు శక్తివంతుడౌతాడు. అవరమైతే కళాసృష్టికి సాయపడతాడు. ఆ విషయం అలా నిజమైన కళను, కళాకారుని సృష్టించి పోషించడానికి సంఘం స్థిరంగా వుండాలి. జాతిలో సామాన్య సంస్కృతి వుండాలి.

కనుక హిందూ దేశంలో, కేవలం కళాభివృద్ధికి పోషణకు అంకితమైన ఎకాడమీ చేతుల్లో కళను పెట్టడం ఉచితంగానే వుంది. గతంలో, కళ, కళాకారుడు రాజదర్బారుల ఆధరువున అభివృద్ధి చెందాయి. శిల్పం, చిత్రకళ, సంగీతం సాహిత్యం' కవిత్వం యివన్నీ అభిజాత్యుల చేతుల్లోనే పెంపొందాయి. ఈనాడా వర్గం మనదేశంలో లేదు. ప్రజారాజ్యమే జోక్యం కలిగించుకొని లలిత కళలను అభివృద్ధిచేయాలి. మరోమార్గం లేదు. సంప్రదాయకమైన ప్రాచీన కళను కొనసాగించి వానిని ఆధునిక కళారూపాలతో మేళవించే కొద్దిమంది వ్యక్తుల పోషణకై ఆర్థిక వనరులను వెచ్చించడం సమంజసమా అనే ప్రశ్న మనముందు వుంది. ప్రయోజనవాదం, సామ్యవాదం ప్రబలిన ఈ యుగంలో కళను కళకోసం పోషించడ మనడం భావించడానికి కష్టతరమైన విషయం. ఈ శోచనీయత్వాన్నే మన మెదుర్కోవలసింది. నేటి కళాకారుడు తన వ్యాపారానికి ప్రస్తుతార్థిక విలువ ఉన్నదని సమర్థించుకోలేడు. అంతేకాదు, సర్వ సమిష్టి కార్యాలు – అతి ప్రభుత్వానికి సంబంధించినా, సంబంధించక పోయినా– సమష్టి ప్రజాభిప్రాయాన్ని సంతృప్తి పరచడమే లక్ష్యంగా పెట్టుకుని ప్రవర్తిల్లాలి. ఆలాంటి సంతృప్తి కోసమై పరిణమించిన ప్రమాదమే వాస్తవికతా వాదం. ప్రయోజనమే లక్ష్యంగా గల జన సామాన్యం ఆస్వాదించ గలిగిన సౌందర్యాన్ని సృష్టించేదే వాస్తవిక కళ. వాస్తవికతలో సంకేతానికే మీ స్థానంలేదు. ప్రతిబింబించడానికి సాహజంగా సాధ్యంకాని అతి సున్నితమైన గుణాలకు వాస్తవికతా వాదంలో తావులేదు. యుద్ధానికి పూర్వాబ్దాలలో, సోవియట్ యూనియన్‌లో వెలసిన కళ ఇందు కుదాహరణ. భావార్ధకమైన కళ "Ahstract" బూర్జువా కళగా పరిగణించబడింది. సంఘ ప్రయోజనమే లక్ష్యంగా పెట్టుకొనని కళకు బ్రతుకేహక్కు తిరస్కరించబడింది అందువల్ల వచ్చిన ఫలితం - కళ, కళాకారుల సమస్య. ఫ్యాక్టరీ పనివారల సమిష్టి రూపంలోనే భావించబడ్డాయి. ఆ రెంటికీ వున్న తేడాయేంటంటే ఫ్యాక్టరీ వస్తువులెక్కువ మొరటగా వుంటాయి కళావస్తువు లేమో కొంత నాజూగా వుంటాయి. ఇంతేనట కళా రంగంలో ఈ రకమైన వాస్తవికతా వాదాన్ని నే నంగీకరించలేను నా మట్టుకు నాకు తోచిన సత్యమేమంటే కళాస్వాదనశక్తి సాహజంగా వుండాలి. కళలో ఆత్మ వైరుధ్యముంటే ప్రేక్షకుని ఇంద్రియాలకు హాయికలగదు అంతమాత్రాన ఆటువంటి కళని రద్దుచేయకూడదు అంతేకాదు – మానవుడెంత గంభీరుడైతే అతడి గ్రహణశక్తి అంతవిశాల మవుతుంది. అప్పుడాతడి ఆత్మలోవున్న వైరుధ్యం అంతఎక్కువగా అగుపిస్తుంది, ఆ వైరుధ్యాన్ని సమన్వయించుకోవలసిన ఆవసరం ఎక్కువగా గుర్తింపబడుతుంది. కనుక కళావస్తువు ఇంద్రియాలకు

(తరువాయి ప్రక్క పేజీలో)

# ఆంధ్ర హరీంద్రా

—:O:—

అల్లూరి సీతా రామ రాజా!
తెలుగుతల్లి వరాల వెలుగుల రోజా!

మన్యంలో విప్లవ ప
ర్జన్యపు గర్జనతో
తెల్లవారి స్వార్థంలో
బల్లెం దూశావురా!

మదంబట్టి క్రీడించెడి
మద మత్తేభాల గూల్చ
కుంభ స్థలాల మీది
కురికిన ఆంధ్ర హరీంద్రా

మల్లు యోధుల తోటి
విల్లనంబులతోటి
తెల్ల దొరలనల్ల గుండె
ఝల్లని పించావురా!

దౌర్జన్యం తిప్పికొట్ట
తెలుగు పౌరుషమ్ము జూపి
నీ రక్తం వారుపోసి
వీరుడవై నిలచావా!

తెలుగుతల్లి వీరప్రభల
దిగంతాల దాక ప్రాక
స్వాతంత్ర్యపు దీక్షతోడె
చివరదాక పోరావా!

తెలుగుజాతి నర నరాన
వెలిగే ప్రీతిరక్త కణం
"అల్లూర ని పేరెత్తిన
వెల్లువవై పొంగునురా!

—మురారి

సుఖాన్నిస్తుందా లేదా అనే ప్రశ్నకు తావులేదు. నికరమైన కళావస్తువు మానవుని హృదయతంత్రులను స్పందిస్తుంది. ఆ స్పందన మానసిక చిత్రాన్ని సృష్టిస్తుంది. ఆ చిత్రం యావచ్చైతన్యంతో సమ్మేళనం చెందుతుంది. అలా అవధంమానవునకు అనుభూత మవుతుంది. కనుక, ఏ దైన కళావస్తువును పర్యాలోకించేప్పుడు మనస్సులో వుంచుకోవలసిన కొలబద్ద యిదే.

ఇట్టి ఉన్నత లక్ష్యాలను దృష్టిలో వుంచుకొని మన సాంస్కృతిక సమాఖ్యలు తమ కార్యక్రమాలను నిర్వహించుకోవాలి. నేడు జరుగుతూన్న సమావేశాల వంటివి మన దేశీయ లలిత కళాప్రగతి చరిత్రలో మజిలీలై నిలచిపోవాలి. సారస్వతానికి, సంగీతానికి, చిత్రలేఖనకు మరియితర అనుబంధ కళలకు మూడు ఎకాడమీలు నెలకొల్పడంద్వారా, ఆయారంగాలలో పనిచేసేవారికి సమకృషిని ఆరోగ్యకరమైన వాతావరణంలో కొనసాగించు కోడానికి సాధనాన్ని యివ్వడం మాత్రమే రాష్ట్రప్రభుత్వం చేసింది. ఈ సాధనాలను సద్వినియోగం చేసుకొనే వంతు సంస్కృతీ కృషీవలురది. ఆర్థిక సహాయం, తదితర నిర్వహణ సాహాయ్య సౌకర్యాలు కల్పించడం ప్రభుత్వం వంతు. తన వంతు పనిని ప్రభుత్వంచేస్తుంది రవీంద్ర ప్రెమిసెస్‌లో ఈ మూడు ఎకాడమీల కార్యాలయాలు, సమిష్టి లైబ్రరి, ఆర్టుగ్యాలరీ, రిహార్సులు వేసుకొనే స్థలం, కమిటీహాలు నిర్మాణం చేయాలనే కార్యక్రమం రాష్ట్రప్రభుత్వ పరిశీలనలో వుంది. ఈ ప్రతిపాదన రూపెత్తినరోజు ఈ మూడు సోదరీ సమాఖ్యలు అతిసన్నిహిత పరస్పర సాహకారంతో పనిచేయడానికి అవకాశాలు ఏర్పడతాయి. (New Para) ఈ నాడు మన దేశంలో కళాకారుల నెదుర్కొంటున్న సమస్యలకేసి, ఇక్కడ చేరిన కళాకారులు, విమర్శకులు తమ దృష్టిని సారిస్తారని నేను విశ్వసిస్తున్నాను. కళను రక్తి సోచనీయంగా కొరవడుతూన్న నేటి యువకులలో కళాభిరుచిని పెంపొందిస్తారని నేను విశ్వసిస్తున్నాను.

మన ప్రజా జీవితాన్ని ఎక్కువ సున్నితంగా, సుందరంగా, ఆనంద మయంగా చేయడమనే సమిష్టిలక్ష్యం మిమ్మల నుద్బోధిస్తుంది. ఈ మహోన్నత లక్ష్యాన్ని సాధించడంతో మీ చర్చలు మన దేశాన్ని ఒక అడుగు ముందుకు తీసుకపోగలవని నా విశ్వాసం.

ఈ సమావేశానికి అధ్యక్షత వహించడం నేనొక గౌరవంగా భావిస్తున్నాను. అందుకు మీకు నా వందనాలు, శుభకాంక్షలు.

—:O:—

## మన పి. వి. జీ.

(6 వ పేజీ తరువాయి)

ఆంధ్ర ప్రదేశ్ విద్యామాత్యులుగా ప్రమాణం స్వీకారం చేసిన తరువాత తిరిగి ఆరు లక్షల రూపాయలు విలువజేసే "పూల్ బాగ్" విజయనగరం స్త్రీల కళాశాలకు దానం చేశారు. విద్యాసంస్థలకు యింత విరివిగా దాన ధర్మాలు చేస్తూ విద్యాభివృద్ధికి తీవ్రంగా కృషిచేస్తూ యున్న శ్రీ పి. వి. జి. విద్యామంత్రి గావడం ఎంతో ముదావహం. వివిధ విద్యాసంస్థలు, విద్యార్థి సంస్థలు, విద్యాభిమానులు శ్రీ రాజుగారు విద్యామంత్రిగా నియమింప బడడంతో ఆనంద చకితులయ్యారు. వీరి హయాంలో విద్యావ్యాప్తి, విద్యాభివృద్ధి ఆంధ్ర ప్రదేశ్ పొందగలదని ఆశించవచ్చు.

## సందేశ

"సోషలిజపు ఆవశ్యకతను సవివరంగా ప్రజల ముందుంచవలసిన అవుసరాన్ని యీ ఎన్నికలు నిరూపించినవి. ఎచ్చటైతే కాంగ్రెసు వాదులు తీవ్రంగా యీ సందేశాన్ని తీసుక వెళ్ళగలిగారో అచ్చట ప్రజల సంపూర్ణ సహకారాన్ని సంపాదించారు. ఏదోరకంగా చాల పార్టీ, విచ్ఛిన్నకర శక్తులు కాలూన గల్గుచున్నవి. వాటిని మన శక్తి నంతా ఉపయోగించి ఎదిరించి పోరాడవలసి యున్నది."

శ్రీమతి ఇందిరాగాంధీ 'సోషలిస్టు కాంగ్రెస్ మన్'కు పంపిన సందేశము



(11 వ పేజీ తరువాయి)

ఆ క్రందన ఆర్థికమంత్రి చెవులబడుట లేదు. ఈ బడ్జటు ప్రతిపాదనలు పెట్టు బడి దారీ వ్యవస్థ కుపకరించేవని వారు నిందిస్తే తప్పనలేము,

మిశ్రమ ఆర్థిక విధానము ఆర్థిక మంత్రిగారున్నూ, కాంగ్రెసు సిద్ధాంత విధానాలకు సవాలుగా యున్నారన వచ్చు ఎంత త్వరలో యీ విషయం ఆలోచిస్తే అంతమంచిది. అందువల్లే పార్లమెంటులో అనంగీకారంగా యున్న యీ బడ్జెటును ఆమోదించారు స్వతంత్రపార్టీ నాయకుడు శ్రీ దయాభాయ్ పటేలు చెప్పినట్లు యీ బడ్జటు మితవాదం వైపు మొగ్గ జూపింది."

ఆ వడిలో సోషలిజం లక్ష్యంగా శ్రీ ఢెబర్ అధ్యక్షతన కాంగ్రెసు అంగీకరించడంతో సోషలిజం తొలి విజయాన్ని సాధించింది. అంత మాత్రాన ఆ లక్ష్యసిద్ధికి మార్గం సుగమంగాబోదు. అందుకు అనువైన ప్రణాళికా విధానం, ఆర్థికవిధానం కావాలి. ఆ విధానాలను సృష్టించేందుకు గూడ సరైద భావాంగీకారం గల్గిన వ్యక్తులు ఆయా స్థానాలలో ఉండాలి ముఖ్యంగా స్వత్వానికి మూలమైన ఆర్థికశాఖ లక్ష్యానికి భిన్నంగాని ఆవ్యక్తు లధీనంలో యుండాలి,



# విజ్ఞప్తి

దేశంలోని ప్రజానీకా భ్యున్నతికి ప్రజాస్వామ్య సోషలిస్టు సమాజ నిర్మాణమే శరణ్యమని మనకాంగ్రెసు తీర్మానించింది. సోషలిజంయొక్క విశిష్టత, అవసరాలను సవివరంగా ఆంధ్ర ప్రజలకు తెలియ పరచి, తద్యాధనకు తయారు చేసేందుకు మా "జ్వాల" నడుంకట్టి కృషి చేయగలదని విన్నవించుకొను చున్నాము. జాతి సంపదకు మూలాధారమైన శ్రామికజన సేవే మా "జ్వాల" ధ్యేయం. అందుకొరకు పాటు పడే "కాంగ్రెసు సోషలిష్టు ఫోరం" ఆశయాలతో ఏకీభవించి కృషి సల్పేందుకు మాకు చేయూత నివ్వ వలసిందిగా కోరు చున్నాము.

సంపాదక వర్గం.



# కాంగ్రెస్ సంస్థకు సేవచేయడమే నా ధ్యేయం

గుంటూరు జిల్లా కాంగ్రెస్ కార్యకర్తల సమావేశం 29-4-62న గుంటూరులో బాపూజీ స్కూలులో గుంటూరు జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ వెనిగళ్ళ సత్యనారాయణరావుగారి అధ్యక్షతన జరుపబడింది, రాష్ట్ర కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ మంతెన వెంకట్రాజుగారు మాట్లాడుతూ కాంగ్రెసు వాదులలో ఐక్యత, సంస్థపట్ల గౌరవం, విశ్వాసం పెంచుకోవాలనీ, వ్యక్తులపై మక్కువ తగ్గించాలనీ చెప్పారు. ముఖ్యంగా గుంటూరు జిల్లాలో యున్న విభిన్న వ్యక్తుల మధ్యగల అభిప్రాయ భేదాలను తొలగించుకొని సంస్థ కార్యక్రమానికి సిద్ధాంతాలకు సేవ చేయాలని తెలియజేశారు.

శ్రీ బ్రహ్మయ్యగారు మాట్లాడుచూ, శ్రీ మంతెన వెంకట్రాజుగారి అభిప్రాయాలను అర్థం చేసుకున్నాననియు, రాజుగారు సంస్థపట్లగల ప్రేమతో, ఇంత కాలమునుండి పెంచి పెద్ద చేసిన కాంగ్రెసు పాడయిపోతుందనే బాధ, ఆ వేదనతో మాట్లాడారనియు. అలాగా కుండ యుండేందుకు అంతా ఉమ్మడిగా కృషి చేయవలసి యున్నదనియు నుడివారు, గత నలభై సంవత్సరాలనుండి తాను కాంగ్రెస్‌లో వాలంటీరుగా సేవ చేశాననియు, స్వర్గీయ డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు, ముట్నూరి కృష్ణారావుగార్ల నాయకత్వాన పని చేశాననియు ఆనాడు పదవులకంటే సేవకే ప్రాధాన్యమిచ్చి పని చేశామనియు చెప్పారు, కృష్ణా జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడుగా కీ॥ శే॥ ముట్నూరి తాను చాల యువకుడననియూ, అంత పెద్ద పదవీ భారాన్ని నిర్వహించలేనని చెప్పిరి. కృష్ణారావు గారు తన పేరు ప్రతిపాదించగా తాను కృష్ణారావుగారి పేరు ప్రతిపాదించామనియు. తామిద్దరము ఉపసంహరించుకుంటున్నామని చెప్పగా అలాకాదని కీ॥ శే॥ పట్టాభి సీతారామయ్యగారు ఓటింగుకు పెట్టగా స్వర్గీయ ముట్నూరి కృష్ణారావుగారి అనుచరులంతా తనకున్నూ



జి. బ్రహ్మయ్య

తన అనుచరులంతా కృష్ణారావుగారికి ఓటు చేయగా తనకు కృష్ణారావుగారి కంటే ఒక్క ఓటు అధికంగా రావడంతో తాను ఎన్నికయ్యానని చెప్పారు. దానికి ప్రధానకారణం అప్పట్లో ఎన్నికలను బహిష్కరించాలని కాంగ్రెసు ఆదేశించగా ఆంధ్ర రాష్ట్రం మొత్తంలో తన స్వగ్రామమైన ఘంటసాల ఒక్కటే ఖాళీ పెట్టెలను తిప్పి పంపగల్గినదనియు, ఆ కీర్తిపర్యవసానమే తనకు జిల్లాకాంగ్రెస్ అధ్యక్ష పదవి అంటగట్టారనియు, అలాగే కాంగ్రెసు కార్యక్రమాన్ని అమలు జరిపేందుకు పట్టుదలతో యువకులంతా కృషి చేయాలనియూ చెప్పారు. ఆదినుండి కాంగ్రెసుకు సేవ చేస్తూయున్నవారికంటె యితరుల చేతిలోనికి అధికారం, పెత్తనం పోతున్నదన్న విమర్శకు సమాధానంగా ఆ విషయంలో కొంతవరకు యదార్థమున్నప్పటికి కొన్ని పొరపాట్లు కారణాంతరాలవల్ల సంభవించుచున్నప్పటికి లోపాలకంటె మంచికి ఎక్కువ ప్రాధాన్యత యివ్వవలసిందిగా మనవి చేశారు. తన కంటే జూనియర్ కాంగ్రెసువాదులు తన కంటె ఉన్నత పదవుల నధిష్ఠించారనియు, అది వారి అదృష్టంగా మాత్రమే తాను భావించాననియు, తానెప్పుడూ ఈర్ష్య పడలేదనియు తోటికాంగ్రెసు వాదులంతా అలాగే భావించాలనియు, సెలవిచ్చారు. స్వార్థపరు లెప్పుడూ ప్రతి సంస్థలోను, ప్రధానంగా రాజ్యాంగ అధికారం చేతిలో యున్న పార్టీలలో, ప్రవేశిస్తూ యుండటం సహజమేననియు, వారి ఆటలు కట్టించేందుకు మిగతా కార్యకర్తలు కృషి చేయవలసినదే గాని, సంస్థకు వ్యతిరేకంగా వ్యవహరించ రాదనియు చెప్పారు, క్రమ శిక్షణ విషయంలో తాను నిర్మొగమోటస్థుడననియు, క్రమ శిక్షణారాహిత్యాన్ని తానెప్పుడూ సహించననియు, తెల్పుచూ వ్యక్తికంటె సంస్థకే ప్రాముఖ్యత యివ్వవలసిందిగా కోరారు. గతంలో

— కొరవ 22 వ పేజీ చూడుడు —

[8వ పేజీ తరువాయి ]

ప్రేమిస్తున్నావో నీకే తెలీదని, ఎందుకని ప్రేమను అందుకొనలేక పోయావో నీకసలే తెలీదని, ఒక పిచ్చి మారాజువని, మాట్లాడితే దుఃఖపడతావని, ప్రపంచపు పోటీలో ఓడి పోతావని చెప్పకనే తెలిసింది. అందాక ఎందుకు, నీవాలంక ఎట్లా ఉందో ఒక్కసారి చూచుకో మహానుభావ! నీ గొప్పవ్యక్తివి అన్నాను

"ఇంకా అంతే అను."

"ఇక నిన్నుగురించి ఇంకా ఏమంటాను."

ఈ మాటకు నాపాదాలు పట్టుకొని చేతుల్తో నలిపేసి, "నిజంచెప్పు నన్ను గురించి నీవు దుఃఖపడుతున్నావా? నేను నీకేమైనా కష్టాన్ని కలిగించానా?" అనిజవాబుకోసం ఆగిపోయాడు.

"ఒకవేళ అలాంటిదేమైనా జరిగి ఉంటే, నీ పాపానికి ఏమి ప్రాయశ్చిత్తం చేసికొందా మనుకొంటున్నావ్?"

జవాబు చెప్పలేక పాదాలు వదలివేసి, చేతులు విరుచుకొంటూ, "ఏమి ప్రాయశ్చిత్తం ఉంటుంది. నేనేం చేయగలను. అయినా నీకు తర్కజ్ఞానం ఉంది అందుకు నీకొక నమస్కారం. నేను నిన్ను దుఃఖపెట్టానన్నమాట" "అన్నాడు నేను ముఖం ప్రక్కకు త్రిప్పుకొన్నాను. ఉన్నట్లే ఉండి "నేను నిన్ను మళ్ళా పెళ్ళి చేసుకొంటాను," అన్నాడు త్రాగివచ్చినవాళ్లు ఇంత సందర్భంగ మాట్లాడ్తార్ననమాట. ఈ మాటకు నాకు బాగ నవ్వొచ్చింది.

"మొత్తానికి నీకు బలే శిక్షగుర్తుకు వచ్చిందే," అన్నాను.

"ఏం ఎందుకని అవదు? అది ఒకవేళ కాదా ఏమిటి?"

"అవును ఒక వేళేంటి—ఏవేళా కాదు. మనిషికి ఒక చావేకాని రెండు చావు లుంటాయాఅని? రెండో పెళ్ళంటా వేంటి—ఒక పెళ్ళి చాలదూ."

క్రింద సిగరెట్ పీకలు పడి వున్నవి. అవినేను చూస్తుంటే, అతను గ్రహించి, "అబ్బే! వాటిదేముందిలే. పర్వాలేదు, సిగరెట్లేమీ చేయవుగా" అని చెప్తున్నాడు.

"అవును, ఏమీ చెయ్యవు నీవు వాటిని కాలుస్తుంటే అవి నిన్ను కాలుస్తవి"

"ఛ! ఛ!! నేనసలు మానేస్తేనా! ఇప్పుడే మొదలుపెట్టా."

"ఏమటి అబద్ధాలా"

ఈ మాటకు అతనికీ నవ్వువచ్చింది. నవ్వి,

"నీలో ఉన్న దుఃఖానికి విలువకట్టి ఎవరికైనా అమ్మేద్దామని వుంది. బహుశా చాల డబ్బు రావచ్చు." అన్నాడు. ఉండుండి మహా తెలివి తేటలయిన మాట లంటాడాయన. ఆ మాత్రం తెలివి అందరికీ లేక పోలేదు.

"వచ్చేం లాభం; ఆ డబ్బు నీవే ఉంచుకొంటావుగ." అన్నాను.

"ఎందుకుంచుకోను, ఆ దుఃఖం నేను తెచ్చిపెట్టిందేగ."

"అలైతే నీవే కొనుక్కో."

"నువ్వెప్పుడూ ఇట్లా విమర్శగానే మాట్లాడుతావుకాని, ఈ తెలివి ఒకే ఒక సారి లేక పోయింది. నా ప్రేమను ఎప్పుడైతే స్వీకరించావో, ఆ నాడే నీలో ఉన్న అహం తొలగిపోయింది."

"నీకు ఇంకో విషయమేమీ జ్ఞాపకానికి రాదా ఏమిటి."

"అయితే-నీకు తెలుసునో తెలీదో కాని, ఈ మధ్య నీవు చాలి లావెక్కిపోతున్నావ్." అని నాకళ్లల్లోకి చూచాడు. నేను న్యూనత భావాన్ని పొంది, చూపు మరల్చుకొని, "అవును ఆ విషయం నాకెట్లా తెలుస్తుంది, ఇంకేమైనా మార్పులుంటే చెప్పు వినాలనేఉంది" అన్నాను. నన్నతడు రకరకాల పేర్లుపెట్టి పిలుస్తూ ఉంటాడు. ఒకొకసారి 'పిచ్చ' అంటాడు. ఇంకోసారి 'గడుగ్గాయీ' అంటాడు ఇంకోసారి 'అహల్యా' అంటాడు, ఏపేరు పెట్టినా నాకిష్టమే. నేను పలుకుతాను నేనతని సర్వస్వాన్నికదూ! అందుకన్నమాట ఈసారి అతను తల దించుకొని, ఇంకో క్రొత్త పేరుతో పిలుస్తూ, "కాని, నీవు విచారంగా ఉన్నావు కాబోలు నీ నవ్వు వెనుకటిలా లేదు నీకేమైనా భయంగావున్నదా ఏమిటి' అన్నారు, నేను లావవు తున్నానని అతడన్నమాటకు అర్థంమీకు తెలుసు నను కుంటాను. నేను అదే ఆలోచిస్తున్నాను. ఇద్దరమూ ఎవరమూ కొద్దిక్షణాలు మాట్లాడలేదు. ఇక నేనే అన్నాను. "ఇద్దరమూ భయపడ్తున్నామల్లే ఉన్నది నీ కౌగిలి వెనుకటిలా లేదు. కాని ఈ స్పృహకు, ఈ స్పర్శ జ్ఞానికే కదా మన మిద్దరమూను. ఇక మన భయం లోకుల్ని గురించికాదు. భగవంతుడ్ని గురించి" అని ఈ సారి అతడు నా పెదవుల్ని గట్టిగ ముద్దు పెట్టుకొన్నాడు. పెదవుల తడిని అతగాడి చొక్కాకి తుడిచి, "నీతో ఇందాకటినుంచి ఒక విషయాన్ని చెప్పాలను కొంటున్నాను" అన్నాను. గదిలో ఏదో సిరా ఒలక పోస్తే వచ్చే వాసనలా, పెళ్ళి అవబోతున్న ఇంటికి రంగులు వేస్తున్నప్పటి వాసనలా ఉన్నది గాఢమ్ము, అనుబంధము అయిన కౌగిలిలోనే ఉండి ఏమిటది చెప్పు చూద్దాం అన్నాడు ఈ మాత్రం చెప్పలేనను కున్నాడు గాబోలు!

"నీ విహ్వాళ ఏ మాత్రమో త్రాగి వచ్చావ్" అన్నాను.

అతడు నన్ను ఒక్కసారిగ వదలిపెట్టి, "అట్లాగేఅను నేను నిజంగా ఎప్పుడో ఒకప్పుడు తప్పత్రాగి నీ కౌగిలిలోనే సొమ్మసిల్లి పోతాను" అన్నాడు. నేనీ మాటకు ఏ మాత్రం చలించక, కొందరు కొందరు ఒక్కొక రకంగ నవ్వుతారే అట్లా నవ్వి, "అట్లాగే చచ్చి పోదువు గానిలే కాని నీకు ఇవ్వాళ చాల బాగుంది కదూ" అన్నాను.

"నాకు చాల బాగున్నమాట నిజమేకాని, నేనివ్వాళ త్రాగి రాలేదు" అన్నాడు.

"త్రాగు బోతులు, పిచ్చివాళ్ళు ఇంతకంటే ఇంకేమంటారు?"

"నీ మీద ఒట్టు."

"ఇంకోమాటు ముద్దు పెట్టుకో ఈ సారి చెప్తాను త్రాగావో లేదో."

"తాగితే తాగాన్లే, నీదేం పోయింది అవును నే నివ్వాళ తాగే వచ్చాను, నీమీద ఒట్టు, అయితే నన్నిప్పుడేం చేయమంటావ్" అని ముద్దు పెట్టుకొన్నాడు.

"పోన్లే త్రాగితే మాన్లే" అన్నాను.

"ఇక తాగను."

కాసేపు ఎవళ్ళమూ మాట్లాడలేదు. ఈ నిశ్శబ్దం—ఒక చేతకాని రచయిత సంభాషణల్ని నడపడంలో పడే కష్టంలా ఉన్నది. ఏం మాట్లాడాలో, ఏం మాట్లాడించాలో ఎవళ్ళకు మాత్రం ఎట్లా తెలుస్తుంది.

"నిన్ను మర్చి పోలేను. నా ప్రేయసీ నిన్నొక్కళ్ళనే మర్చి పోలేను." అన్నాడు ఉండుండి. ఉండుండి ఇటువంటి మాటలే అంటా డతడెప్పుడూను. ఈ మాట నా కేదో గుర్తుకు తెచ్చింది కాబోలు. సంతోషంతో హృదయం కంపించి పోతుంటే వణకి పోతున్న అధరాలతో అతని పాదాలను చుంబిచాను. నేను ఏడుస్తున్నానో నవ్వు తున్నానో నాకే తెలీదు. ఎక్కడి నుండి వచ్చినవో కన్నీటి బొట్లు అతని పాదాలమీద ఉన్న నా శిరస్సుపై పడటం కన్నీళ్ళతో ఆ పాదాలను ముద్దు పెట్టుకొంటూ, "ప్రపంచంలో ఇదే నా నిజస్థానం, ఇక్కడ మన మెంతో అహంభావంతో వుండి దైన్యావస్థలో చచ్చిపోతాం. ఇంత పవిత్రమైన ఈ స్థలంలో కలుషితమైన నా కన్నీళ్ళు ఇంకి పోయేటంతటి అదృష్టం జగత్తులో ఇంకెవరికి కలుగుతుంది మహానుభావ!" అని పదే పదే వేదమంత్రంలా ప్రేమోల్బణ సూచకంగ గొణుక్కొన్నా. ఆ క్షణంలో ప్రపంచమంతా ఆ పాదాలతోను, కన్నీళ్ళతోను నిండిపోయినట్లని పించింది నాకు.

అతడు వణకుతున్న కంఠంతో నన్ను సంబోధిస్తూ, "అదృశ్యమైన

ఈ రాత్రిలో ఓ అదృష్టవ్యక్తి మనకు మిగిలింది ఈ ఒక్కరాత్రి చాల త్వరలో తెల్లవారి పోతుందల్లేఉంది. ఈ సమయంలో ఏవిధమైన దుఃఖాన్ని పెట్టుకోకు'' అని చెప్తున్నాడు. ఎవరో. "బెగ్ యువర్ పార్డన్" అన్నట్లు విన్పించింది. ఇంకా చిన్న చిన్న ధ్వనులు విన్పిస్తున్నవికాని, అంత స్పష్టంగ లేవు. అవి నేను వినాలని కూడా అతడి ఉద్దేశ్యం కాదేమో. అతడి మాటలలో ఏదో మత్తుమందు వాసన వస్తూన్నది, మధ్య మధ్యన చొక్కా అడ్డం పట్టుకొని మాట్లాడుతున్నాడు ఈ రాత్రి కాలంలో కొంచెంసేపు అలానే గడచి పోయింది.

"నువ్వుచెప్పే మాటలు ఇంకొంచెం గట్టిగ చెప్పు" అన్నాను.

"పర్వాలేదులే, అయినా నీకంతగ కుతూహలంగ ఉన్నదా?"

అవు నన్నాను.

'ఈ మాటలు నీ కోసంకాదు'

''మరి!''

"నీవూ నేనూ కాక ఇంకో మూడో వ్యక్తి కూడ ఉన్నాడు. నేననే మాటలు నీవు వినకపోవటమే మంచిది. పోతే నామాటలు నాకేం విన్పించకూడదు. ఇదంతా ఏమిటంటావ్. మూగబాధ, అవునా! ఆ బాధను, ఆ భావాలనుఒక్కొక్కటె వేరు చేసి చెప్తున్నా, వినాల్సిన వాళ్ళు ఎవరైతే ఉంటారో వాళ్ళు వింటేనే చాల మంచి జరుగుతుంది."

"ఎవరేమిటి వారు, పోనీ ఆ మాత్రమైనా చెప్పుచూద్దాం. మీ యిద్దరి సంభాషణ అయిపోయే వరకు నేను నీ పాదాల మీద స్పృహ తప్పి పో యి ఉంటాను." అన్నాను.

"అలా ఎప్పుడూ కాదు. మా ఇద్దరి సంభాషణ అయిపోయిన తర్వాత నేనే నీ పాదాలమీద స్పృహతప్పి పడిపోయి ఉంటాను." అన్నాడతడు.

ఈ పరిస్థితిలో నేను అతనికి చాలదగ్గరిలో ఉన్నాను కాబోలు, అతని హృదయం ఎందుకో వేగంగ కొట్టుకొంటుండటం గ్రహించాను. అందుకు నేను ఉద్వేగాన్ని పొందినా అది బయటకు కన్పించనివ్వక, తడి కళ్ళతో నవ్వుతూ సరే మాట్లాడు, ఇంతకీ ఎవరబ్బా, ఈ చీకట్లో అటువంటి వాళ్లెవరూ, కన్పించటం లేదే అన్నాను.

"ఆ అదృష్టవ్యక్తి చీకట్లోనే కాదు, వెలుగులోకూడ కన్పించడు. అయినా నాకు మాత్రం కన్పించాడను కొంటున్నావా ఏమిటి ఒలే పని! నేనంత యోగినెట్లా అవుతాను. నీతోఉన్న ఈ ఐహిక బంధాల నెట్లా తెంచుకుంటాను–అవతలివ్యక్తి ఎంతటివాడయి నప్పటికీను, అసలు సంగతేమిటంటే, ఈ చీకట్లో ఎక్కడో వుండి ఉంటాడు. మనం వెతికామా ఉండడన్నమాట. ఉంటాడు కాని, కన్పించడన్నమాట ఇటువంటి వ్యక్తిని మనం ఎవరను కొంటూంటాం?" అని ఆగిపోయాడు.

"భగవంతుడు" అన్నాను నేను తడుముకోకుండ.

"ఆ! అదే అతనికి ఏదైన మంచిపేరు పెడ్దామను కొంటున్నా. భగవంతుడేమైనా ఒక నిర్లిప్తమైన వస్తువా ఏమిటి? అందుకనే ఏదైనా మంచిపేరు చెప్పు."

"మనుషులు పెట్టేపేర్లు అతగాడికి అతకవు."

"బలేవని ఎందుకని అతకవో చూస్తావుగా. నీ పేరేమిటి చెప్పు."

''ఏ పేరు చెప్పను? అయినా నాపేరేమిటో నాకంటే నీకే బాగ గుర్తుండాలి" అన్నాను.

ఈ అర్థం పర్థంలేని సంభాషణకు నేను కూడా తల ఊపలేకపోతే, ఈ రాత్రి గడచిపోతే మళ్లీరాదు. అతడు, నీ పేరేదైతే అది భగవంతుడుపేరు" అన్నాడు.

ఈ మాటకు నేను సంభ్రమంతో, "నీకేమైనా పిచ్చిగాని పట్టలేదుకద, భగవంతుడు అమ్మాయా అబ్బాయా," అని ప్రశ్నించాను.

"అవును మరి నాకేమాత్రం తెలివి లేకపోయింది కాదుమరి! త్రాగి వ[illegible] నాయె, నీ తలకాయ భగవంతుడు అబ్బాయా?'' అని నవ్వి ఒక్కసారి గుండె పట్టు[illegible] కొని బాధ పడుతున్నాడు. నేను చేతితో ఛాతీమీద నిమురుతూ, "నేనేనా నీ భగ వంతుడిని'' అని నవ్వాను.

"ఇప్పటికి కాని తెలిసి చావలేదుకద! నీది ఒట్టి మట్టిబుఱ్ఱ. దీనికి తగ్గ[illegible] నీవు ఎక్కడలేని లావెక్కి పోతున్నావ్.'' అన్నాడు.

"ఛీ చీ!! నీవిట్లా అంటున్నావేమిటి?''

"ఈ రాత్రిలోనే ఇంకా కొద్ది క్షణాలలో ఏమవుతుందో తెలుసా?"

''నాకు గాని నీకుగాని ఎవరికైతే మాత్రం ఎట్లా తెలుస్తుంది?''

''నాకు అన్నీ తెలుసుగ, నేను చెప్తున్నాగ. వినరాదూ."

ఈమాట ఇందాకటి మాటలన్నిటికంటె పెద్దగా అన్నాడు. మేమున్న చోటి[illegible] రాత్రికి అంతటా విన్పించింది. అందుకే ఆ రాత్రిగాని, ఆ చోటుగాని, ఆ భగవంతుడుకాని, నేను కాని ఎవళ్ళమూ కిక్కురు మనకుండ, ఏ మవుతుందని చెప్తాడోనని శ్రద్ధగ. వినయంగ, భక్తితో బిక్కు బిక్కు మంటూన్నది. ఇదంతా ఏదో నాటకంలో పతాక సన్నివేశంలా ఉన్నది. నేను,"ఏమవుతుందో చెప్పు" అని అ[illegible] చాను. అతను చాల నెమ్మదిగ వినీ వినిపించకుండ, "భగవంతుడు నన్నెటూ క్షమించడనుకో కనీసం నీవైనా క్షమిస్తావా?" అన్నాడు. ఈ మనిషి ఇవ్వాళ రాకున్నా ఎంత బాగుండేది. ఈ వేళకాని వేళలో, ఈ రాత్రిలో ఈ కన్నీళ్లేమిటి–క్షమాభిక్షలేమిటికి–మృత్యుదేవుడు పంపించిన వర్తమానంలా అర్ధరాత్రి తలుపు తట్టాడు. ఈ గాథ అంతా నే నెవరికి చెప్పుకోను. ఇటువంటి సన్నివేశాలలో స్త్రీలకంటే పురుషులే ఎక్కువగ చలించి పోతారు కాబోలు. నేను గుండె రాయి చేసికొని, "ఇందులో ఎవరితప్పు లేదులే. ఈ అంత్యఘడియలలో ఈ కన్నీళ్ళెందుకు, ఈ క్షమాభిక్షలెందుకు "అన్నాను ఈమాటలు నేనెందుకు అనేసానా? అనిపిస్తుంది, అతని కళ్లలో నీళ్లు మెరుస్తున్నవి.

ఇప్పుడు – ఋణం ఉంచుకో - ఋణం కాకపోతే, నీవద్దనుండి నేను తిరిగి ఇవ్వలేనిది తీసికొన్నావే దాచుకో అటువంటి వస్తువును మళ్ళ దేనితో ఇవ్వ వచ్చు నంటావ్? "అని జవాబు కోసమాగి పోయినాడు.

అటువంటి వస్తువును తిరిగి దేనిలోనూ ఇచ్చుకోలేరు"

"అవుడైతే ఎట్లా?"

ఆఋణాన్ని నీవేమైనా తీర్చాలను కొంటున్నావా? అలాంటి ఉద్దేశ్యం నీ మెదడులోనికి ఎలాప్రవేశించిన దసలు? ఎప్పుడైతే నీవు ఋణగ్రస్థుడివైనవో అ నాడే నీకీవిషయం బాగ గుర్తుండాల్సింది. నాకు నీవేమైనా ఋణపడివుంటే. అందుకు నేనుగానీ, భగవంతుడుగాని ఆ అప్పు తీర్చమని అడగలేదే, పైగ ఏవిధంగ తీరుద్దామనుకొంటున్నావేమిటి? నేనీ విషయమైనా సవ్యంగ ఉంటుదేమో చూద్దాం? అని ఆగిపోయాను.

కొద్దిక్షణాల తర్వాత వపాయల నోట్లు నాముందు పడివున్నవి. ఈ రాత్రి అతడు, నాప్రియుడు, అదే నాభర్త, ఊర్కేరాలేదన్నమాట, డబ్బులతో వచ్చాదన్నమాట, ఇంత దుఃఖంలోను ఎక్కడనుండి వచ్చినదో ఒకనవ్వు,

"ఓహో! పిచ్చిమహారాజా! లోకంలో డబ్బుతోనా ఋణాలు తీర్చుకొనేది ఇంతకూ ఇదేం సరిపోతుంది. నీదగ్గరే ఉంచు, అయినానేనే నీకివ్వాలేమో"నన్నాను

"ఉంచు ఎందుకైనా పనికొస్తుంది.''

"ఎందుకు పనికొస్తుంది. తగలేసినా మంటైనా రాని ఈదబ్బు ఎందుకన్నా పనికొస్తుందా?"

"నీకీ రాత్రి ఏదో పిచ్చిపట్టినట్లుంది."

"హ ! హ !! పిచ్చెందుకు పట్టదు! ఈరాత్రి ఇట్లానే గడిస్తే నేనే పిచ్చిని పట్టుకొంటా "నీ తలకాయలే" - బాగ ఆనందంగ ఉన్నపుడు అతనికి ఈమాట అనటం అలవాటు. కళ్లు గట్టిగ నొక్కుకుంటూ, "నీవీరాత్రి ఏమీ భయ సంకోచాలను పెట్టుకోకు. ఎందు కంటే- ఎందుకూ లేదుటే చాలనిచ్చింతగ ఉండు. ఎంతో ప్రశాంతంగ ఉన్నదిప్పుడు. తర్వాత తుఫాను వస్తుందనే భయంకూడలేదు, జీవి ఎప్పుడూ అను మానాలతో వెళ్ళిపోకూడదు. నీకన్నీళ్ళు చూస్తుంటే నాకు సంతోషంగా ఉంది - అ! అ! వాటినేం చేయకు, నీ కన్నీళ్లను నాకు బలిగా ఇవ్వు ....నీవు నీవు ఇప్పుడేమైతే చెప్పాలను కొంటున్నావో, ఏమైతే చెప్పకూడదను కొంటున్నావో, అవన్ని చెప్పెయ్. ఎందుకంటే - ఆ తర్వాత చెప్పేందుకు గాని, వినేందుకుగాని, ఎవరు మిగలకపోవచ్చును. మంచిగాని, చెడుగాని, మనం చేద్దామనుకొంటే జరిగే పనులా! మనం నవ్వుతాం, ఏడుస్తాం, పుడ్తాం, చచ్చిపోతాం, ఇదంతా నీనా ప్రతిభలే నంటావా? ఎవరి అజేయమైన శక్తో! ఈ రోజు రాత్రి చివరకు నీవూ నేను మిగిలామంటే - రాత్రి తెల్లవారితే ఈ మిగిలినది మిగలకపోవచ్చు ఏమిటీ - నేను చెపున్న ఈ విషయాలన్నీ నీ మెదడులోనికి ప్రవేశిస్తున్నాయా. ఊర్కేనే తల కాయ ఊపుతున్నావా! ఎందుకూ ఎవరైతే దుఃఖ పడరో వాళ్ళు సంతోషాన్ని మాత్రం ఎట్లా పొంద గలరు. - వింటున్నావా? అని ఆగిపోయాడు. ఎక్కడనుండో ఒక దగ్గుతెర వచ్చింది. అతని హృదయంపై నేను శిరస్సు ఉంచి, "నా కన్నీ అర్థమవుతున్నాయి, నేను నీ ప్రపంచాన్ని కాదు నీ భగవంతుడిని." అన్నాను. హృదయంలో కోరి కలు వాటి అవధుల్ని మించిపోవునపుడు, మనిషికి చచ్చిపోవాలనే ఆరాటం కలిగినప్పుడు ఇట్లాగే ఉంటుంది. "నీవు నాకోసం చచ్చిపోతున్నావన్న విషయం అన్నిటికన్నా బాగ అర్థమవుతున్నది." అన్నాను కన్నీళ్ళు తుడుచుకొంటూ, "అబ్బే. అబ్బే వాటినేం చేయకు." అన్నాడు. "కన్నీళ కేం నిన్ను చూస్తేనే ఏడుపొస్తుంది అన్నాను నవ్వుతూ. "హృదయంలో ఎంతో దుఃఖం ఉంటే గాని కన్నీళ్ళురావుకదా కన్నీళ్ళతో ఉన్న నిన్ను చూస్తున్నప్పుడు నువ్వెన్ని అబద్ధాలైనా చెప్పుగాక. నీవు అన్నీనిజాలే అనుకొంటాను. అన్నాడు "అవును దుఃఖానికి అంతవిలువ, ప్రపంచంలో కొనడానికిగాని, అమ్మటానికిగాని వీలు పడని వస్తువు. అన్నాను నాతలకాయి అన్నిటికీ ఊ కొట్టడంమేనా నాకేమి తెలుసు ?

నేను అల్లుకొన్న జడ పాయలు పాయ లుగ విప్పేసి, పొడవైన శిరోజాలను తన ముఖం మీద కప్పుకొని, "నేను ఒక చోటికి వెళ్తున్నాను వుడు మేలుచేస్తే, అక్కడ బాగానే ఉండొచ్చు. దే

అసలు ఎక్కడైనా నీవూ నేను చాల బాగ ఉండొచ్చు. మరి నీవుకూడ అక్కడకు వస్తావా ఏమిటి! అని అడిగాడు.

"దేవుడు మేలు చేయక పోయినా వస్తాను." అన్నాను.

"ఏదీ నీ చెయ్యి ఒకసారి ఇలాఇవ్వు." అన్నాడు. నేను ఏడుస్తూ చెయ్యి ఇచ్చాను.

"ఈరాత్రి నీ కొక క్రొత్తపేరు పెట్టు న్నాను." అన్నాడు.

"భగవాన్కూడ క్రొత్తపేరు పెట్టావు కదా." అన్నాను.

"అవును అచ్చుగ అలాటిదే అని నన్ను సంబోధిస్తూ,

"ఓనా భగవాన్! నేనివ్వాళ ఏమాత్రమో త్రాగివచ్చానన్నాన్. అందుకు నేనేమీ సిగ్గు పడటం లేదు. కాని నేను త్రాగినదల్లా విషం మాత్రమేనని చెప్తున్నాను.........

—:O:-

## శుభాకాంక్షలు

తెలుగు జాతీయ వారపత్రిక "జ్వాల" ను, తిరిగి ఆంధ్ర ప్రజకు అందచేయు భారం వహించినందుకు చాలాసంతోషము. పత్రిక నడుపుట చాలా కష్టం. మీలో ఆర్థికపరిస్థితి చక్కపరచనిదే పత్రిక వెలువడుట కష్టతరమైన నప్పటికి కార్యభారం వహించినందుకు నా ధన్యవాదములు. జాతిపిత మహాత్మా గాంధీజీ మహానుభావుని నాయకత్వాన స్వాతంత్ర్యం సంపాదించి దేశాన్ని పునర్నిర్మాణంచేసి దేశంలోని బీదరికాన్ని రూపు మాపవలెనని అహర్నిశలు కృషిచేయు కాంగ్రెసుసంస్థ, యిప్పుడీ నవభారత నిర్మాతపూజ్య పండిత జీనాయ కత్వాన "ప్రజాస్వామ్య సామ్యవాద వ్యవస్థీ కరణమే కాంగ్రెసు లక్ష్యంగా తీసుకొని కాంగ్రెసు దేశాన్ని పరిపాలిస్తూ, తమలక్ష్యాన్ని అమలు జరుపుతూ యున్నది. ఆంధ్ర రాష్ట్రము కీ॥ శే॥ కొండా వెంకటప్పయ్య "ఆంధ్రరత్న" పట్టాభీ. కళా, ఆంధ్రకేసరి లాంటి మేధావులు సంస్థను స్థాపించి, వృద్ధికితెచ్చి యువక నాయకులు సంజీవరెడ్డి, సంజీవయ్య, అల్లూరి, లాంటి వారి నాయ కత్వం క్రింద ఆంధ్రరాష్ట్రం విశాలాంధ్రంగా గాను కాంగ్రెసును పటిష్టంజేసి రాష్ట్ర పునర్నిర్మాణంలో తమశక్తిని వినియోగించి భారం వహించి నడుపు చున్న యీ సమయంలో "జ్వాల" మారదర్శ కత్వం వహించటం సబబు అయినది. ఒక ప్రక్క కాంగ్రెసు సంస్థలో సాదారణ ఎన్నికలలో కలుషిత మైన రకరకాల వ్యక్తులను తమస్వార్థం కొరకు సంస్థను ఉపయోగ పెట్టుకొను టకు ప్రయత్నించటం. రెండవ ప్రక్క మూడవ పంచవర్ష ప్రణాళిక, ఆర్థిక దుస్థితి వలన ప్రజలమీద ఆధారపడి 'మొదలు పెట్టడం, ఇటువంటి క్లిష్ట పరిస్థితులలో "జ్వాల" ధైర్యంగా తప్పులు జూపించి సంస్థను ప్రతిష్టించ టంలో తన ప్రజాస్వామ్య సామ్యవాద వ్యవస్థీకరణ, ఆశయం అమలు జరుపుటలో తీవ్రకృషి చేయుటకు వెనుకాడదని ఆశించు చున్నాను, తమ కార్యభారము సఫలీకృత మొనర్చమని శ్రీ వెంకటేశ్వరుని ప్రార్థిస్తున్నాను.

ఇట్లు,

వెనిగళ్ల సత్యనారాయణ M. L. C

గుంటూరుజిల్లా కాంగ్రెసు అధ్యక్షులు.

# నిషేధం

''సాక్షి'

హేమంతాన్ని
పొడిగించ వద్దు
ముద్దుల కెడ మీయ వద్దు
ఏ కాంతా సముఖంలో లేని
ఏకాంతంలో
యౌవన కాల మంతా
వో సుదీర్ఘ హేమంతం నరుడా!
రౌరవ నరక బాధకన్నా
దుర్భరమా శైత్యాశని పాతం

రామను వదిలేయకు
జక్కువ గుబ్బల
చామను పోనీయకు
ఏదో బాటుకు చోటీయకు
ఏ కాంతంలో వ్యధపడి పోతావ్
ఘోర హింసల పాల బడతావ్

వైరాగ్య శతకాల వల్లించి
లేని పోని
భావాల నాశ్రయించి
వొంటరి వాడవు కాకు
ఆ చలి పురుష హృదయానికి
రవ్వలు తాపిన బాకు

కని పించని
మనసుని కూడా
కావలించగల దా చలి
ధృతరాష్ట్రుని పిడికిటి కన్నా
బలవత్తర మయిం దది

అరణ్యాల కరణ్యాలు
తగలడినా వదలదు చలి
నిప్పుల కుప్ప మీద
నిలుచున్నా విడ దా చలి

చలి చనుగవ మొన లంటే
నీ గుండెకు వేడి పంట
నిప్పులాంటి కెంపు మోవే
నీ గుండెకు చలిమంట

గుబ్బలాడి బిగి కౌగిలి
గాఢంగా లగించుకో
దానికో "ఉక్కు తాళం"
దృఢంగా బిగించుకో
ఆ తాళపు 'చెవి' మాత్రం
దాచ వలదు మగవాడా!
బంగాళా ఖాతంలో
పారేసెయ్! వేసేసెయ్!

లంకణం పర మౌషధం
రోగికి—నీకు కాదు
మృష్టాన్నా లవసరం
భోగికి—నీకు నాకూ

పరువం కాక లెత్తి
విరహం
గుండె కోటను ముట్టడి స్తే

ఆ చలి దండును ఎదుర్కో—లేవ్
స్త్రీ—అంటే స్త్రీ లేనిది
సంధి ఎలాగూ జరుగదు

కనుకనే మగవాడా
ముద్దుల కెడ మీయ వద్దు
హేమంతాన్ని
ప్రాణ మూది బ్రతికించ వద్దు

నిప్పు ముద్దులోని
సుధల వెన్న తీసి తిను
కౌగిటి చెరసాలలోన
ఖైదిగా చేరి మను

పోనీయకు
చానను—వదిలేయకు
హేమంతం ఎగసి ఎగసి
గుండె మీద కొరిగిందా
రౌరవ బాధాగ్ని కన్నా
దుర్భరమా
శైత్యాశని పాతం
ఏకాకి జీవితం
దుస్సహం నరుడా
దుష్టం
దుస్తరం
దుర్గమం
దుఃఖం!

"నా ప్రణయ ప్రస్థానము నుండి"

కావ్య సమీక్ష :

# * ఆనందలహరి *

ప్రజాహృదయమును లాలించి పాలింప నేర్చిన కవులలో ప్రథమ శ్రేణికులు శ్రీ పాపయ్యశాస్త్రి గారు. వీను మిగిలిన తెలుగు గుండెకు వీలుగా విందుగా పలికి నిండు దనము గలిగింప గలిగిన నైపుణికి కరుణశ్రీ కాణాచి.

వారి ఉదయశ్రీ చిరంతనరసమును నిరంతముగా చిమ్మన గ్రోవులతో చిమ్మినది. "ఏది మఱొక్కమారు హృదయేశ్వర! గుండెలు పుల్కరింపగా" అని యనిపించు కొన్నది. మఱొక్కమారుకాదు ఇరువది యాఱు మారులు కనీస మిరువది యాఱువేల గుండెలను బుల్కరింపఁ జేసినది. సర్వ సహృదయ సంస్తుతి పాత్రమైనది.

శృంగార భావములతో చిగురు తొడిగిన మనస్సులకు ఉదయశ్రీ రెండవ భాగము కవోష్ణ భావదోహదము కల్పించినది. మృదులములయిన భావములు కొంచెము ముదిరినవి. కవులు సప్త సముద్రముల కావల ఒంటి స్తంభపు మేడలలో పసిడి తూగుటుయ్యాలలో తూగువారు మాత్రమే కారు. అట్టడుగున పడిపోయిన ఆణి ముత్యములను వెలికి తీయగలరు, చరిత్ర మాటున పొగ చూరిన సత్యసంఘటనలను స్వ స్వరూపముతో ప్రదర్శింపగలరు. పురుషోత్తముడు - ధర్మపరళు మున్నగు లఘు కావ్యములతో దేశభక్తి పోషకములగు ముక్తకములతో ఈ భాగము వెలువడినది.

విజయశ్రీ కర్తవ్య నిష్ఠను, కార్యాచరణ సామర్థ్యమును కలిగించు కావ్యము, నాటకీయ విధానములో భారత స్వేచ్ఛాశయమును ప్రబలముగా పలికెను. "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" యని చెప్పిన శ్రీకృష్ణపరమాత్మయే నటనకు ప్రబోధకుడయ్యెను జీవితకురుక్షేత్రమున బడలిపోయిన భారతీయునకు స్వేచ్ఛా సంపాదన శంఖము నొత్తి కావ్యమార్గమున సందేశమం దిచ్చెను. వీరభావమును పూరించెను.

కరుణామూర్తియగు బుద్ధదేవుని జీవితము కరుణశ్రీ. కవి కవితానామముకూడ కరుణశ్రీయే. ఈనామ సామ్యము కరుణశ్రీ కావ్యముపై పాపయ్య శాస్త్రీగారికి గల మక్కువను చూపుచున్నది. వారే ఒకచోట కరుణశ్రీ కావ్యమే తమ జీవితమని పల్కిరి. ఆ కావ్య సమగ్ర స్వరూపమును ఆంధ్రలోకము హస్తము లందుంచవలసిన బాధ్యత శ్రీ శాస్త్రిగారిపై నున్నది. ఇటీవు కవిగారు వీరావేశమునకే ప్రాధాన్యము కల్పింతురేమో! యని యింతవరకున్న రచనను బట్టి యనిపించుచున్నది. ఆద్యంతముల సమన్వయించిన పిమ్మట గాని రసనిర్ణయము చేయజాలము.

ప్రస్తుతము వెలువడిన గ్రంధము-

ఆనందలహరి

ఇందు మొత్తము ఇరువది యొక్క పద్యగేయ కావ్యములు గలవు. ఇందు పౌరాణికము నుండి వైయక్తికము వరకు వస్తు స్వభావము సాగినది. మిక్కిలి వైవిధ్యము కలిగినట్లుగానే యీ కావ్య సుమములు గన్పించునుగాని వీని యన్నింటికి నేకత్వమును గల్పించు నొక సూత్రము గలదు. కవితా తత్వమును గుర్తించుట కిదియే ప్రధానము ఉదయశ్రీనుండియు నొకపరిణామము కవిలోనున్నది. అది యిందు విస్తృతమైనది. అది ప్రయోజన సాపేక్షము.



కృతికర్త

శృంగారము మైమరపించునదికాదు. పైగా నిరంతర చైతన్యదాయకము. వీరము ఉత్సాహము స్థాయిగాగలది. కావున చైతన్యమునకు, క్రియా శీలత్వమునకు పరాకాష్ఠ ఉత్సాహమందించును. అది యుద్ధవీరమే కానక్కరలేదు. ధర్మవీరము కావచ్చును హింసాదిరంప మెక్కువైన లోకము మిక్కుటర దుష్కరమై పోయినది. దానియందు దయాప్రవాహములను ప్రవహింపజేసి పవిత్రీకరించిన పిమ్మట వీరపూజన మహత్వమును నాటి మొలకెత్తింపజేయుట విశ్వశ్రేయః కాంక్షులవిధి. వీరభావము విస్తృతమును విశ్వతో ముఖమును గావలయునన్న వీర పూజన మహత్వమును గుర్తించుకొనుట యవసరము, ఆ యవసరమే కావ్యసుమములను చక్కని సరముగా నేర్పఱచు సూత్రమైనది,

ఆనందలహరి శుభోదయముతో ఆరంభమైనది "ఆంధ్ర రత్నమ! మంగళాక్షతల్ పై చల్లవయ్య! నీ కలలు సత్యమ్ములయ్యె" అని మొదలిడి దేశభక్తుని, విశ్వదాతను, శ్రీరాములను ఆవాహనము చేసి గాంధీ దంపతులకు అగ్రతాంబూల మందించుచున్నాడు కవి. అది ఆంధ్ర జనయిత్రి నూత్న గృహప్రవేశ శుభముహూర్తము. అక్కడకుచూడ వచ్చిన జనము ఆంధ్రులకు ప్రాతఃస్మరణీయులు పూర్వ వైభవమునకు ఐక్య ప్రబోధమునుగూడ చేర్చినాడు కవి, ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడినది. అది 'విశాలాంధ్ర'మైనది. ఆంధ్ర జనతయే కాదు, ఆంధ్ర దేశమున వెలసిన దేవతలుకూడ మురిసి పోయిన దినమది.

"ముక్కోటి త్రిలింగ సోదరులకన్నా! నేడు ముక్కోటిరా" అని ఆంధ్ర విష్ణువును దర్శించు కొన్న ఆనందసమయము. సంగీత సాహిత్య శౌర్యధైర్యములను త్యాగయ్య, పోతన్న, రుద్రమ దేవి, రామమూర్తి వచ్చి ఆంధ్రప్రదేశమంతటను దీపింపజేయవలయునని కవి ఆకాంక్ష. చెల్లెళ్ళతో తమ్ముళ్ళతో పాటు తానుకూడ రాష్ట్రలక్ష్మికి అర్ఘ్యపాద్యముల నందించినాడు.

తరువాతిది 'ఆనందలహరి' అను వచన గేయము. ఇదిగట్లు త్రెంచుకొని ప్రవహించినది. భారత దేశము దానిసంకెళ్ళను తెగద్రెంచుకొన్న పుణ్యముహూర్తమును స్ఫూర్తిమంతముగా చిత్రించినది.

> "తెల్లవారితే దేశమంతా
> వెల్లివిరుస్తుంది ఆగస్టు పదునైదు
> తెల్లవారికి స్వస్తి చెప్పడంతో
> తీరిపోయిందానాడు మనఖైదు"

ఈ విధముగా ఉత్సాహము ఉరకలెత్తినది. "చతుస్సింహ ముద్రాంకిత చక్రేశ్వరి"ని కూడా ఆత్మీయముగా చనవుతో "ముసిముసినవ్వులొలుకు ముద్దులచెల్లీ! నీ పెవ్వరు" అని యడుగు చున్నాడు. ఆమె కన్నులలో పూర్వీకుల ప్రనాళికములు కనుగొన్నాడు. ఆమెయే తన్ను ముందునకు నడిపించిన తనకు బలము చేకూర్చిన వారిని గూర్చి చెప్పినది. ఆమె యెవరోకాదు స్వాతంత్ర్య లక్ష్మి స్వారాజ్య లక్ష్మి.

> "నేను స్వాతంత్ర్య స్వప్నలతను
> నా ఆకులు పచ్చన
> నా చివుళ్ళు ఎఱ్ఱన
> నా పువ్వులు తెల్లన
> మువ్వన్నెల పతాకానికి
> ముద్దుల ప్రతీకాన్ని నేను"

'కవితా వైజయంతి' ముక్కుతిమ్మన ముద్దు పలుకులతో సంస్కృతాంధ్రముల కవితారీతిని నిరూపించు ఉత్పలమాలిక. "అజ్ఞాత నేపథ్యము"

నందు కవి జీవితమును నాటకముతో పోల్చుచు షేక్స్పియరు మహాకవికి సహపంక్తిలో సాక్షాత్కరించుచున్నాడు.

"చిత్రమగు నాటకమియ్యది ! దీని నాందినెవ్వారు పఠించెనో భరత వాక్యము విన్నడదెన్నినాళ్ళకున్" అని తన ఆశ్చర్యము. నవ్యకవితా భగీరథులై నవీన మానవతా మహారథులై జవసత్వముల పొంచ జన్యమును పూరించిన విజయసారధులై "మహాకవి" అను శీర్షికక్రింద గురజాడవారు గేయరూపములో సాక్షాత్కారము నొందిరి. విశ్వవైతాళికుడు, ఆంధ్రకేసరి, వజ్ర సంకల్పుడు (పటేల్) శీర్షికలలో దేశవిదేశముల మహానాయకులు మూర్తిని ధరించిరి.

'ఆచార్య దేవోభవ' అను సూక్తినిబట్టి ఆచార్యులు దేవసములై ఆరాధన మందుకొనవలసినవారు. మాగురుదేవులు, విశ్వనాథ, భావోపహారము, ఏటుకూరి - ఈ నాలుగును వరుసగానున్న కావ్యములు, కుప్పా ఆంజనేయ శాస్త్రిగారును. భావోపహారము గ్రహించిన మాధవరామశర్మగారును కవిగారికి గురుదేవులే, ఈ వరుసలో విశ్వనాథను, ఏటుకూరిని చేర్చి కవి తన గౌరవమును వారిపట్లకూడ ప్రదర్శించుచున్నాడు.

"త్యాగయ్య" శీర్షికక్రింద కవి యద్భుతకల్పన చేసెను.

"భోగిరాజుల మిసిమిపాన్పుల పరుండి
ఉదధి కెరటాల నటునిటునూగు ప్రభువు
త్యాగరాజుల తంబురా తీగలందు
రాగములమీద నుయ్యాల లూగసాగె"

దీనిలో కవి హృదయము త్యాగయ్యవైపు ఎంతగా మొగ్గినదో చూడనగును.

"సీత" ఒక గేయనాటిక. సీత క్షమాపుత్రి. ఆమె జీవితమంతయు సహనమునకే ఒక పరీక్ష; అట్లని శక్తిహీనురాలుకాదు, స్త్రీ శక్తిస్వరూపిణి కదా! సహనమునకు పరీక్షావధి. శక్తి ప్రదర్శనకు దీక్షా విధిఅయిన ఘట్టము ఈసీత. కరుణము తలమునకలుగా పోషింపబడినది. సీతను వేర్వేఱు పాత్రలు వేర్వేఱు రీతులలో భావించి సహృదయ చిత్తములకు 'రసవిచ్ఛిత్తిని' కలిగింతురు. నిర్వహణమంతయు రసభూర్వహముగా సాగినది.

సురభి, భువనవిజయం—అను రెండు శీర్షికలు రెండు సన్నివేశములను బురస్కరించుకొని వచ్చినవి. సురభి నాటక సమాజము ఆంధ్ర దేశమున మిక్కిలి ప్రసిద్ధి గాంచినది. ఆ సమాజమును, అందలి నటులను ప్రశంసించుట యందలి విషయము. అట్లే ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో ప్రథమ పర్యాయముగా సంస దాధ్వర్యవమున "భువన విజయము" ఈ రెండిటి విషయమున నొక సందేహము రావచ్చును. కవిత్వము శాశ్వతము గదా! ఇట్టి సన్నివేశముల నాశ్రయుంచిన శాశ్వతత్వము కలుగునా? అని. గడచి పోయిన కవుల రచనలలో నిట్టి రచనముల కొరకు మనమే అన్వేషణ చేయుచుంటిమి. దానిని బట్టి వారి జీవితాభిరుచులను, కవితా సామగ్రిని నిర్ణయించుట కవకాస ముండునని యెంచుచుంటిమి. ఎవరెవరికి వ్రాసిన యుత్తరములనో సేకరించి అందుండి వారి వ్యక్తిత్వమును నిర్ణయించుచుంటిమి. అట్లే వర్తమాన కవులు కూడ వ్రాసిన తప్పేమి? కావ్యత్వము కవి ప్రతిభలో నుండును గాని వస్తువులో లేదు. పనికిరాని యినుపముక్కను గూడ బంగారు కణికగా మార్చగలిదిన శక్తి కవికున్నదని ప్రాచ్య పాశ్చాత్యాలంకారికు లంగీకరించిన విషయమే.

ఈ కావ్యము శ్రీ ఏకా ఆంజనేయులు గారి కంకితము. వారికి ఈ కృతి నిచ్చుటలోనే ఒక చమత్కారము కావ్యతత్వమును పట్టియిచ్చుచున్నది. ఏకావారు దాన వీరులని ఎరిగిన వారికి తెలియును. కవి వీరపూజనమహత్వము నెరిగినవాడు. అందువలననే వారికి చెప్పకయే, అనుమతిని స్వీకరింపకయే గ్రంథమునంకితము చేసెను.

"చెప్పని అంకితమే యిది
తప్పదు గైకొనక; తమ యుదాత్తత కెపుడో
అప్పుపడె సుకవిలోకం
బిప్పటి కానందలహరి యిదె చేకొనుడీ!"
అని కవి వారిని నిర్బంధించెను.

ఇట్లు ఆద్యంతములను సమన్వ యించుకొని చూచినచో "వీరపూజనము" ప్రధానముగా కావ్యతత్వముగా కనిపించును.

భావములకు తగినట్లుగా సంఘటితమైన భాషలో మధుర మనోహరముగా కావ్యము చివరంట సాగినది. మాటల మనస్సును గుర్తించి వానిచేత మంజులముగా సన్నివేశ మోహనముగా మాట్లాడింపగల యోర్పు నేర్పులు పాపయ్యశాస్త్రిగారిలో నున్నంత మరొక కవిలో లేవన్న సాహసము కాదను కొందును. దానికి "ఆనందలహరి" యు అద్దమువలె సాక్ష్య మిచ్చును.

స్ఫూర్తిశ్రీ

(16 వ పేజీ తరువాయి)

ఒకతూరి స్వర్గీయులు డాక్టరు పట్టాభీ ముట్నూరి కృష్ణారావుగార్ల మధ్య సంస్థ ప్రధానమా లేక వ్యక్తులు ప్రధానమాయనే వాదన సంభవించిందనియు సంస్థ ప్రధానమని పట్టాభిగారు, వ్యక్తులు ప్రధానమని కృష్ణారావుగారు వాదించారనియు, కృష్ణారావుగారు మంచి వ్యక్తుల సముదాయంగా సంస్థ యున్నప్పుడే సంస్థకు మంచి పేరు రాగలదనియు, లేకుంటే సంస్థ మలినమై నశించిపోయే దానికి అవకాశం గలదనియు చెప్పారని బ్రహ్మయ్యగారు తెలియజేస్తూ వ్యక్తుల లోపాలను సవరించి సంస్థను పటిష్టం చేయవలసినదిగా కార్యకర్తలకు విజ్ఞప్తి చేశారు.

అంతకు ముందు గుంటూరు జిల్లా జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు కార్యకర్తల సమావేశంలో బ్రహ్మయ్యగారు పాల్గొన్నారు, అనేకమంది కార్మిక కార్యకర్తలు కాంగ్రెసు సంస్థ, కార్మికోద్యమాలకుండ వలసిన అవినాభావ సంబంధమును గూర్చి ఉపన్యసించారు. ప్రత్యే కాహ్వానితులుగా విచ్చేసిన శ్రీ కాకాని వెంకటరత్నంగారు మాట్లాడుచూ కార్మికోద్యమ ప్రాసస్త్యాన్ని కాంగ్రెసు నాయకత్వం గ్రహించవలసి యున్నదనియు, అలా లేనిచో కార్మికులు కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం క్రిందికి పోవడం జరుగ గలదనియు వివిధ శాఖలలోని అధికార్లు జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు పట్ల హీనభావంతో వ్యవహరించుచున్నారనియు, అందుకు కాంగ్రెసు ప్రభుత్వాలకు బాధ్యత యున్నదనియు తెల్పుచూ శ్రీ బ్రహ్మయ్యగారి హయాంలో కాంగ్రెస్ కార్మికోద్యమాన్ని గుర్తించగలదని ఆశిస్తున్నామని తెలియజేశారు.

కార్మిక సమస్యలు పరిష్కరించడం క్లిష్టం, గాంధీజీ అహమ్మదాబాద్‌లో కార్మికసమస్యల పరిష్కారానికి 21రోజు ఉపవాసం చేయవలసివచ్చినది, లాభం ధ్యేయంగా యున్నవారిని అంగీకరింపజేయడం కష్టం. కాంగ్రెసుసంస్థ కార్మికోద్యమానికి చేయూత నివ్వగలదని హామీ యిచ్చారు.

మొగల్రాజపురం
విజయవాడ-4

